# స్నోఫాల్




## న్యూట్రిన్ రుచుల
## శ్రేష్టత సర్వదా
## మీ అభిమానత

అతి మధురము,
అసాధారణము, అత్యద్భుతము
అయిన బహురకాలు మీ కందిస్తాము.
మిల్క్ కారమెల్, డచ్‌టాఫి, ఫ్రూట్రిన్ బార్స్,
హనిఎక్లర్స్... మరెన్నో.... మీకోసమే.
మీ మెప్పులతో భారత దేశంలోని
కన్‌ఫెక్షనరీ కంపెనీలలో అత్యున్నత
స్థానము పొందితిమి. ప్రత్యేకమైన కన్‌ఫెక్షనరీ
రకాలు అందించటమే మా బాధ్యత.



**ఒక్కొక్క మిఠాయియందు**
**షడ్రసపూరితవిందు!**




న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెనీ లిమిటెడ్,
చిత్తూరు, ఆం.ప్ర.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]

శుక్రవారం : 24-3-'78
పింగళనామ సం. ఫాల్గుణ శు. పౌర్ణమి
*సంపుటము 71 : సంచిక 27*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడిప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ
''మంచిబాబాయి''లో
శోభన్‌బాబు, జయచిత్ర

*కథలు :*



*సీరియల్ కథలు :*



*వ్యాసాలు, శీర్షికలు :*



ఆంధ్రప్రదేశ్ కొత్త ముఖ్యమంత్రి
డా. యం. చెన్నారెడ్డిగారు

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

3.3.78 సంచికకు కొమిల్లావిర్కి ముఖచిత్రం మీ(మా) పత్రికకి హైలైట్ ముఖచిత్రాలు మంచి ఆకర్షణగా వేస్తున్నందుకు ఎడిటర్‌గార్కి మా ధన్యవాదాలు ఈ వారం కథలలో అర్థంకాని సంగతి మమ్మల్నెంత ఆకట్టుకుంది సినిమా అనే కథబాగా లేదు పాలొక్కని డైరీలో విశేషాలు బాగుంటున్నాయి.

ఎస్. జగన్‌మోహన్ గౌడ్, ఖాదర్‌పాషా (జడ్చర్ల)

* * *

నా అభిమాన నటి వాణిశ్రీ ముఖచిత్రంతో 17—2—78న వెలువడిన ఆంధ్రసచిత్ర వార పత్రిక నన్నెంతో ఆకర్షించింది. రాగమాలిక సీరియల్ చాలాబాగా నడుస్తుంది. ప్రచురించిన మీకు, రచయిత్రి శ్రీమతి మాధవపెద్ది పూజ్యశీలా ప్రసాద్ గార్కి మా ధన్యవాదాలు జి. నరసింహమూర్తిగారి చీకటి చిమ్మేదీపం కథ చిన్నదైనా చాలా బాగుంది.

యస్ ప్రభాకరరావు, (ఆదోని)

* * *

3—3—78 తేదీ పత్రిక ముఖచిత్రం చూసాక నాకీ అభిప్రాయం వ్రాయాలనిపించింది 1977లో సెక్సీ ముఖచిత్రాలు ప్రచురిస్తున్నారని అలాంటివి ప్రచురించవద్దని చాలమంది పాఠకులు తమ అభిప్రాయాలు వ్రాశారు. మళ్ళీ ఈ సంవత్సరము కూడా సెక్సీ ముఖచిత్రాలు ప్రచురించి రికార్డు బద్దలు చేస్తారేమోనని భయంగా ఉంది.

గరుగురామం (బొబ్బిలి)

## విందు

ఈ వారం 10.3.78 నాటి సంచిక షడ్రసోపేతమైన విందులా మమ్మల్నలరించింది. ముఖచిత్రం నేత్రాలకు విందు చేయగా, కథలు, సీరియల్ కథలు మనసుకు విందు చేశాయి. కథలలో ముఖ్యంగా మంథా వెంకటరమణారావు గారి 'బరువు' బరువైన కథానికయే అని చెప్పొచ్చు కాటూరి, రాగతి పండరిగార్ల కార్టూన్లు కడుపు చెక్కలయ్యేటట్లుగా నవ్వించాయి.

శ్రీనివాస్‌గారి 'సినిమాలు, జి. వి. జి. పేజీ' రెండూ ఒక దానితో ఒకటి పోటీ పడుతున్నట్లుగా వున్నాయి. అన్ని శీర్షికలు బాగున్న ఈవారం కన్నడ మిఠాయిలతో వెలువడిన (మా) అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక మమ్మల్ని ఆనందసాగరంలో ముంచెత్తింది.

గంటా ఉమాశంకర్‌రెడ్డి, కమలారెడ్డి, రుక్మిణీదేవి, రామతిలకందేవి, భారతిదేవి, (బరంపురం)

## ధర్మపథం

10.3.78 నాటి పత్రిక మమ్మల్నెంతగానో ఆకర్షించింది. రమణయ్యగారు ధర్మపథం లో బౌద్ధుల అష్టాంగ మార్గము గురించి చక్కగా వివరించారు. వారికి మా అభినందనలు.

కలపటపు గిరిజాకుమార్, (కృష్ణలంక.)

## సీరియల్

(3.3.78) కొమిల్లావిర్కి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ముచ్చటగా ఉంది. రాగమాలి సీరియల్ చివరికి ఎలా ముగుస్తుందోనని భలే ఆత్రుతగా వుంది ఈ వారం కథల్లో సినిమా అర్థం కాని సంగతి మాకు బాగా నచ్చాయి. శ్రీనివాస్‌గారు సినిమా వార్తలు చాల చక్కగా అందిస్తున్నారు

టి. కమలాకర్ ప్రసాద్ (రాజోడు)

* * *

24 2 78 మీ(మా) పత్రిక ముఖ చిత్రం మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. రాగమాలిక సీరియల్ బాగుంది. వెలుగొస్తుంది కథ చాలాబాగుంది ఈకథ రచయిత గారయిన దేసెట్టి కేశవరావుగారికి మా అభినందనలు తెల్పండి. జి వి జి. గారి పేజీ పత్రికకే ఒక హైలైట్. శ్రీనివాస్ గారి సినిమా కబుర్లు చాలా బాగున్నాయి. మిగిలిన కథలు కూడా బాగున్నాయి.

బాలకృష్ణ, పూర్ణ (కోరాపుట్, ఒరిస్సా)

* * *

వేదగిరి రాంబాబు, వైశంపాటి భాస్కర్ల కలం నుండి వెలువడిన కొత్త జీవితం థ్రిల్లింగ్‌గా ఉంది ప్రతి క్రొత్త జంట మనసులలోను పన్నీటి జల్లు చల్లి గిలిగింతలు కలిగించక మానదు. రియల్లీ ఇట్‌ ఈజ్ లవ్ లీ స్టోరీ.

చంద్రశేఖర్‌గారి అర్థం గాని సంగతి వాస్తవానికి దగ్గరగా ఉండి హృదయాల్ని కదిలించింది. రాజుకు సుబ్రహ్మణ్యం ఉత్తరాలు, రెడ్డికి డైరీలు ఈ కథ మాకు మిగిలి పోయాయి.

ఇంత మంచి సెలక్షన్స మా పత్రికలో ఉండటం మా పాఠకుల అదృష్టం.

వరప్రసాదరావు (పామర్రు)

## కథలు

3.3.78 పత్రిక చదివాను. అర్థంగాని సంగతి శ్రీ చంద్రశేఖర్‌గారి కథ, నన్ను ఈ ఉత్తరం వ్రాయడానికి ప్రేరేపించింది. కథలో సుబ్రమణ్యం పాత్ర చాలా ఉదాత్తమైనది. సుబ్రమణ్యం డెత్‌తో కథ ముగియడం హృదయవిదారకంగా వున్నది కథకి ఆ చక్కని మలుపు అవసరం. ''మనుగడను ఇప్పుడు నవ్వుతూ రేపు ఏడవటం చేయవద్దు. బతుకు బాట సుదూరము— కలిసి మనం హాయిగా నడిచేద్దాం— నవ్వుల పువ్వులు పంచేద్దాం.. ఆహా! ఎంతచక్కని వాక్యాలు. ''ఎంత చక్కని చిక్కని మిత్రత్రయం సుబ్రహ్మణ్యం, రెడ్డి, రాజులది. ఒక చక్కని కథ చదివాననే తృప్తి కలుగుతోంది శ్రీ చంద్రశేఖర్ గారికి పత్రికా ముఖంగా నా ధన్యవాదాలు అందజేయండి.

డి. వి. రామకృష్ణ, (చిత్రకొండ— ఒరిస్సా)





# కలలోని కలిమి

జి.యస్. శ్రీనాథ్

''ఏమిటి, శంకరయ్యా, పెందలాడే వచ్చావ్ ?''

''మరేముందండి. మామూలేగా.''

''అంటే ?''

''నిన్నటి నుండి తిండి లేదు. భార్య, బిడ్డతో...''

''చాలించవయ్యా నీ సణుగుడు. ఎంత కాలమని నీ సంసారాన్ని ఆదుకోమంటావు ? ఇప్పటికే బోలెడప్పయ్యింది. నీవు తీర్చే దెప్పుడు ?''

''మంచికాలం రాకపోదండీ, మీ ఋణంతో పోను.''

''నేను ఋణమని నీ కేనాడూ యివ్వాలేదు. ఋణం నీ నుండి యీ జన్మలో రాదని నాకేమి తెలియదంటావా? నా దంతా ధర్మ బుద్ధి.''

''ఎట్లో లెండి. మీ మంచి తనాన్ని మరచిపోను. పుణ్యముంటుంది.''

''పుణ్యమో, పాపమో. ఇందా పట్టు.'' అని సాహుకారు శాంతయ్య, శంకరయ్య చేతిలో రెండు రూపాయలు పెట్టాడు.

శాంతయ్య మొగంలోని అశాంతిని గ్రహించేందుకు శంకరయ్యకు వ్యవధి లేదు. ఇచ్చిందే పదివేలనుకొని, పరమానంద భరితుడై లేచాడింటికి పొయ్యేందుకు.

అంతలో యేదో తళుక్కున ఆలోచన తోచి సాహుకారు ''కూచో, శంకరయ్యా. నీ కలాగు దినగండం నూరేండ్లాయుస్సు అన్నట్టుందే, యింక బిడ్డ పెండ్లెప్పుడు చేస్తావు ?'' అని ప్రశ్నించాడు.

''బిడ్డ పెండ్లా? ఆ సంగతి దేవు డెరుగు. ఆ సంగతి తలచుకొంటే నాకు మా ఆవిడకు గుండెలవిసి పోతాయి, శాంతయ్యగారూ.''

''అమ్మాయి కెన్నేళ్ళుంటాయి ?''

''ఇరవై అయిదు దాటాయి.''

''మీ కూతుర్ని నేను చూచాను చాల అందమైన అమ్మాయి.''

''అందాన్నేమి కొరుక్కు తింటారా, శాంతయ్యగారూ? వేలకువేలు వరకట్నం క్రుమ్మరిస్తే కాని యెంతటి పనికిమాలిన వరుడు దొరకడు. నాలాంటి బీదవాని బిడ్డ నెవరు చేసుకొంటారండి?''

''మీకు దరిద్రాన్నిచ్చిన దేవుడు మేలు కూడా చేశాడంటాను.''

''ఏమిటండీ ఆ మేలు?''

''అమ్మాయిని చూస్తే చాలు, ఎవడైన వరకట్నం లేకనే ఎగురేసుక పోతడు.''

''అదంతా ఒట్టి భ్రాంతి డబ్బు లేనివా ళ్ళెందుకు కోరగారు.''

''శంకరయ్యా, నీ మేలు కోరి ఒక సలహా చెబుతా. వింటావా?''

''చెప్పండి. మీరెప్పుడూ మా మేలు కోరేవాళ్ళేగా?''

''వరకట్నం యివ్వంది బిడ్డ పెండ్లి చేయలేనంటావా?''

''అదేకదండీ నే చెప్పేది. ఆ శక్తి నాకు ఉండేది లేంది మీకు తెలవదా? ఉంటే యిన్నాళ్ళూరకుంటానా? మనసు రోసి పొయ్యింది. కడకు దారినిపొయ్యే దాసయ్యకు అమ్మాయిని ధర్మం చేద్దామనిపించింది.''

''పోనీ, మీ బ్రాహ్మణుల్లో ఏలుకోకపోతే బ్రాహ్మణేతరులలో చూడరాదా?''

''ఎవడైన వరకట్నం మీంది ముందుకు రాడు. కడకు వర్ణాంతర వివాహమైన నాకు సమ్మతమే.''

శాంతయ్య కళ్ళల్లో తళుక్కుమనింది. మొగం విప్పారింది.

''అలాగా? నిజమేనా నీ మాట ?''

''ఏ మాట ?''

''వర్ణాంతర వివాహానికి నీవు, నీ భార్య

ఒప్పుకొంటారా మీ కూతురు సమ్మతిస్తుందంటావా?''

''ఎందుకొప్పుకోము. వరకట్నం పీడ, పెండ్లి ఖర్చు మీద పడకుంటే చాలు. మేమురెడీ. అలాంటి ఉదారుడైన అబ్బాయి ఎక్కడున్నాడో చెప్పండి.''

అయితే ఒక మాట. మన వీరారెడ్డిగారి యింటికి అతని బంధువట ఒకతనువచ్చాడు. వయసు ముప్పైయేళ్లుంటాయి. ఇంకా పెండ్లి కాలేదంట అతనికి. బాగా డబ్బున్నవాడు. చూచేందుకు చాలా ఠీవిగా ఉంటాడు వీరారెడ్డితో మీ సంగతి చెప్పమంటే చెబుతా.''

''నా భార్యను బిడ్డను ఒక మాటడిగి, మళ్ళీ మిమ్మల్ని మధ్యాహ్నం కలుస్తా.''

''అలాగే. మీరు ఒప్పుకొంటే, మీ చేతి నుండి ఒక చిల్లిగవ్వ ఖర్చు కాకుండ, పైగా మీ చేతికి పదివేల రూపాయలు వచ్చేట్టు చేస్తా.''

''సరే లెండి. మళ్ళీ వస్తా'' నంటూ శంకరయ్య వెళ్ళిపోయాడు.

శాంతయ్య చెప్పిన మాటలు నిజం. అంతకు ముందు దినమే తన మిత్రుడు వీరారెడ్డిని కలుసుకొని యేదో మాట్లాడుతూంటే, రెడ్డి ఆ అబ్బాయి సంగతి చెబుతూ ''ఇతని పేరు రాజశేఖరం. మా కాపు కులస్థుడే. మాకు దగ్గరి బంధువు కూడ. విజయవాడలో పెద్ద యెత్తున వ్యాపారం చేస్తున్నాడు. బాగా డబ్బు కలవాడు. అదేమి పిచ్చోకాని మా కులంలోని పిల్ల వద్దంట. పేదదైనాసరే బ్రాహ్మణుల యింటి పిల్లే కావాలంటాడు. కావలిస్తే పదివేలు నగదిస్తాడంట.'' అని యాదాటుగా చెప్పకు పోతుంటే, శాంతయ్య యాథాలాపంగా విన్నాడు.

ఈ దినం శంకరయ్య మొగం చూస్తే సరికి, అతని నిశ్చయాన్ని విని, వీరారెడ్డి చెప్పింది జ్ఞప్తికివచ్చి ''వీలైతే ఈ బీద బాపనికి సాయం చేద్దా'' మనుకొన్నాడు.

శంకరయ్య వెళ్ళిపోయినప్పటి నుండి శాంతయ్య మనసులో అదే ఆలోచన మెదల్తోంది. ''ఈ బ్రాహ్మణుడు తన బిడ్డను లెక్కిస్తాడా! ఏమో! దారిద్ర్యం ఏ పనైనా చేయిస్తుంది.'' అని అతడు ఆలోచిస్తూంటే, ఆ మధ్యాహ్నం శంకరయ్య తన మాట ప్రకారం వచ్చాడు.



# 'స్వరసాగర్' పంకజ్ మల్లిక్!

ప్రముఖ గాయకుడు, సంగీత దర్శకుడు, టాగూర్ గీతాలను పాడటంలో మంచి పేరు పొందిన శ్రీ పంకజ్ కుమార్ మల్లిక్ తన 73 వ ఏట దక్షిణ కలకత్తాలోని ఆయన నివాస గృహంలో ఫిబ్రవరి 19 వ తేదీన కన్ను మూసారు. ఆయనకు భార్య, కుమార్తె వున్నారు.

శ్రీ మల్లిక్ 1905 మే 10 వ తేదీన కలకత్తాలో ఒక మధ్య తరగతి కుటుంబంలో జన్మించారు. ఈయనకు సంగీతంపట్ల అభిరుచి వున్నందున ఉన్నత విద్య నభ్యసించలేక పోయారు. 1927 లో తన కంఠ మాధుర్యాన్ని మొట్ట మొదట ఆకాశవాణి ద్వారా వినిపించి తర్వాత నటుడు దర్శకుడు, గాయకుడు ఐనా కూడా రేడియో వదలలేదు. చివరివరకుకూడా ఆకాశవాణిలో తన పాటలను వినిపించారు. మొట్ట మొదట సంగీత గాయకుడిగా ప్రసిద్ధికెక్కి, తర్వాత కొన్ని చిత్రాలకు సంగీత దర్శకుడిగా ఐనారు. శ్రీ మల్లిక్ 'డాక్టర్' చిత్రంలో హీరోగా కూడా నటించారు.

ఈయనకు 1932 లో 'స్వర-సాగర్' అవార్డు లభించింది 1970 లో 'పద్మశ్రీ' బిరుదు నిచ్చారు. 1973 లో భారత ప్రభుత్వం దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు బహూకరించారు. శ్రీ మల్లిక్ పాడిన 'పియా మిలన్ కో జానా'' సంగీత ప్రియుల హృదయాల్లో శాశ్వతంగా నిలిచి వుంటుంది. ఆయనకు ఎందరో అభిమానులు దేశంలో వున్నారు. ★

అతని ముఖం ప్రఫుల్లంగా ఉండడం చూచి తన సలహా అతనికి, యింటివారికి నచ్చి ఉండొచ్చు ననిపించింది శాంతయ్యకు. అతని అంచనా తప్పు కాలేదు.

''శాంతయ్యగారూ! మీ సలహా చాలా బావుందని మా ఆవిడ ఒప్పుకుంది. మా దారిద్ర్యం తీరితేచాలు. దానికితోడు అమ్మాయి సుఖంగా ఉంటుంది కదా! ఇంక తరువాత యేమి చేయమంటారో చెప్పండి'' అని శంకరయ్య చెప్పేసరికి, శాంతయ్య నమ్మలేనట్టు కన్నులింత చేసి చూచాడా బ్రాహ్మణునివైపు. తరువాత జరిగిన అర గంట సంభాషణలో శంకరయ్య ఒప్పందల మనస్ఫూర్తిగా యివ్వబడిందని శాంతయ్య గ్రహించాడు.

''సరే, నే నిప్పుడే వీరారెడ్డిగారి యింటికెళ్లి అన్నీ మాట్లాడుకొని వస్తా. సాయంకాలం యింటివద్దనే ఉంటావు కదా?'' అని అడిగాడు సాహుకారు.

''తప్పకుండా ఉంటాను— మీ రాక కెదురు చూస్తూ ఉంటాము మేము ముగ్గురం.''

శంకరయ్య చాలా హుషారుగా మాట్లాడి యింటికెళ్లాడు. నిజంగా అతనికి సహాయం చేయాలనే సద్బుద్ధితోనే అరగంట తరువాత సాహుకారు వీరారెడ్డి యింటికెళ్లి, అతనితో శంకరయ్య విషయమంతా సమగ్రంగా చెప్పాడు.

అప్పుడక్కడేఉన్న రాజశేఖరం కూడ విన్నాడంతా.

''పిల్ల ఆరోగ్యంగా, అందంగా ఉంటే నాకు నచ్చినట్టే. మీరుచెప్పినట్లు శంకరయ్య గారికి పదివేల రూపాయలిచ్చి, యిరువైపుల పెండ్లి ఖర్చులు నేనే భరిస్తా'' అన్నా డతడు.

ఆ సాయంకాలం తన మాట ప్రకారం శాంతయ్య శంకరయ్య యింటికెళ్లి, రాజశేఖరం అభిప్రాయాన్ని తెలిపి, ఆ మరునాడే పెండ్లి చూపుల కేర్పాటు చేసి వచ్చాడు.

శంకరయ్య కూతురు లలిత నిజంగా ఆ బీదవాని యింట్లో తప్పు పుట్టింది. ఏ మహారాజుగారి యింట్లోనో పుట్టవలసిన మహాలక్ష్మి లాంటిదా అమ్మాయి. పెండ్లి చూపులకని వీరారెడ్డితో వచ్చిన రాజశేఖరం ఆమెను చూచిన క్షణంలోనే ఆ మోహనాంగిని మెచ్చుకొని ''అయ్యా శంకరయ్యగారూ, మీకు పదివేల రూపాయలిస్తా. అమ్మాయి పెండ్లి ఖాయం చేయండి'' అన్నాడు.

''చాల సంతోషం. నాపక్షంగా శాంతయ్య గారే అన్నీ మాట్లాడారు. మా కందరికి యీ వర్ణాంతర వివాహం యిష్టమైంది.''

''అమ్మాయిని మా సమక్షములో ఒక మాటడగండి.''అని వీరారెడ్డి యెందుకైన మంచిదని సలహా యిచ్చాడు.

''ఏమమ్మా నీకీ రాజశేఖరాన్ని పెండ్లి చేసుకొనేందు కెట్టి అభ్యంతరం లేదు కదా?'' అని శాంతయ్యే అడిగాడు అతను.

తనకు సమ్మతమే అన్నట్టులలిత చిఱు పెదవుల మీద సుందర మందహాసం నాట్యం చేసింది.

శంకరయ్య భార్య ''తథాస్తు''అనింది.

కలపిన పెద్దలు యిద్దరు— శాంతయ్య, వీరారెడ్డి— సంతోషించారు.

శంకరయ్య మళ్లీ మనసు మార్చుకొంటాడేమో అని అనుమానించిన రాజశేఖరం అతన్ని అడుగవలసిన ప్రశ్నలడిగి, అత డిచ్చిన సమాధానాలతో తృప్తి పడ్డాడు.

''శంకరయ్యగారూ, మీకు యీ దినమే పదివేల రూపాయలిస్తాము. లగ్నపత్రిక వ్రాయండి'' అన్నాడు వీరారెడ్డి.

శంకరయ్య వెంటనే పంచాంగ మందుకొని, తిథి వార నక్షత్రాలు లెక్కించి, లగ్న పత్రికను వ్రాయ సిద్ధపడడంలో రాజశేఖరం లలిత కొక పట్టుచీర రవికె, ఒక బంగారు చైను తెప్పించి యిస్తూ, తత్కాలోచితమైన మంగళ ద్రవ్యాలను సమకూర్చాడు.

ఆ తతంగమంతా ముగిశాక వీరారెడ్డి ''శంకరయ్యగారూ, మా వెంట యింటికి రండి డబ్బిస్తాను'' అని శంకరయ్యను పిలుచుకొని రాజశేఖరంతో వెళ్లాడు. వారి అభ్యర్థన మీద శాంతయ్య కూడ వారి ననుసరించి పోయాడు.

ఎదురు చూచినట్టుగ ఆ తతంగమంతా చకచక నడిచి పోయినందుకు శాంతయ్య చాల సంతోషించి శంకరయ్యను అభినందించాడు. తమ అదృష్టానికి శంకరయ్య దంపతులు మురిసిపోయారు. తాను కోరిన బ్రాహ్మణ కన్య లభించినందుకు రాజశేఖరానికి ఏనుగు నెక్కినంత సంతోషం కలిగింది.

లగ్న పత్రికలో ఒక ప్రతిని శంకరయ్య రాజశేఖరం చేతిలో పెట్టగానే రాజశేఖరం తనకు కాబోయ్యే మామ చేతిలో పదివేల రూపాయల కట్ట నుంచాడు. ఆ యానందముతో శంకరయ్య తన కెవరివల్ల యీ అదృష్టం లభించిందో ఆ శాంతయ్యకు తన కృతజ్ఞతను తెలుపుకోవడం మరువలేదు.

ఇంటికొచ్చిన పిదప ఉత్సాహం ఉప్పొంగిపోతూంటే శంకరయ్య భార్యతో యిట్లన్నాడు. ''ఏమేవ్ మన అదృష్టం మంచిది. ఒక దెబ్బలో రెండు పిట్టలు రాలాయి. ఒక వైపు పదివేల రూపాయలు చిక్కాయి. ఇంకొకవైపు అమ్మాయి పెండ్లి సమస్య తీరింది'' అని రూపాయల కట్టనామె కప్పగిస్తూ ''ఇదిగో చూడు పార్వతీ, మన దారిద్ర్యాన్ని యీ విధంగా దేవుడు తీర్చాడు. పోతే వర్ణాంతర వివాహమనేగా? ఉష్! అయితేనేమి? మనం కులంవాడు యింత సుళువుగా దొరికేవాడా? ఈ రోజుల్లో మహామహులే యిలాంటి వర్ణాంతర వివాహాలకు ఎగబడుతూంటే మన మొక లెక్కా? ఇంతకు ఎవరి సుఖం వాళ్లది. లలిత దర్జాగా రాణిలాగా బ్రతుకుతుంది.

## ధర్మపథం

రామకోటి–అంటే కోటి సారులు శ్రీరామ నామం–వ్రాస్తే ఎంతో పుణ్యమనీ, మోక్షం లభిస్తుందనీ మనవారి నమ్మకం. ఈ నమ్మిక కలవారు విష్ణుభక్తులు, శివ కేశవులను సమానంగా చూచేవారూ మాత్రమే! శైవులు కైవల్యాన్ని పొందడానికి రామకోటికి బదులుగా శివకోటిని రాస్తారు.

రామనామం తరింపజేసేదనీ, కాశీలో మరణించేవారి చెవిలో శివుడే ఆ తారక మంత్రాన్ని వినిపిస్తాడనీ,చెప్తూ ఉంటారు. ఆ రామనామానికి ఎటువంటి శక్తి ఉన్నదో శివుని నామానికి కూడా అట్టిమహిమ ఉన్నది.

శివనామ మంటే ఒక్క 'శివ'అనే నామం ఒక్కటే కాదు. శివుని నామాంతరాలైన మహాదేవ, శంభు, శంకర, హర, భవ మున్నగునవి అన్నీ శివనామాలే! వీటిలో

## కలలోని

# శివనామ మహిమ

— బులుసు వేంకటరమణయ్య.

దేనిని ఉచ్చరించినా పాపాలు నశిస్తాయి. సామాన్య పాపాలే కాదు. మహాపాపాలు కోట్లకొలది ఉన్నవి కూడా నశిస్తాయి

'కోటయో బ్రహ్మహత్యానాం
అగమ్యాగమన కోటయః
సర్వే ప్రశమ మాయాంతి
మహాదేవేతి కీర్తనాత్.'

పంచ మహాపాతకాలలో బ్రహ్మహత్య ఒకటి. అట్టి బ్రహ్మహత్యలు కోట్లకొలది చేసినా సరే, అగమ్యాగమనాది మహాపాపాలు కోట్లకొలది చేసినా సరే! అట్టి పాపాత్ముని పాపాలన్నీ 'మహాదేవ! మహాదేవ!' అని కీర్తించినంత మాత్రముననే నశించిపోతాయి. అని దీని అర్థం.

అంటే శివనామోచ్చారణవల్ల ఎటువంటి పాపాలయినా నశిస్తాయని గ్రహించాలి.

'మహాదేవేతి వక్తారం
దృష్ట్వైతు యమకింకరాః,
పలా యంతే మహా భీతాః
స్మృత్వాతు యమశాసనమ్'

మహాదేవుణ్ణి స్మరిస్తూ, స్తుతిస్తూ ఉన్నవానికి ప్రాణావసాన సమయంవచ్చినపుడు యమకింకరులు అతని దగ్గరకు వచ్చినా సరే! అతని ప్రాణాలు తియ్యలేరు. 'మహాదేవ' అనే దాన్ని వినగానే వాళ్లకు ఎంతో భయం కలుగుతుంది తమప్రభువైన యముని శాసనాన్ని తలచి కూడా ఏమీ చెయ్యలేని స్థితిలోనే ఉంటారు— అని దీని అభిప్రాయం.

శివనామ మహిమ అట్టిది! నిశ్చలమైన మనస్సుతో దేవదేవుడైన మహాదేవుని స్మరించే వారికి ఎలాంటి ఆపదలూ రావు. తన భక్తుల రక్షణ బాధ్యతను ఆయనయే వహిస్తాడు.

# కలిమి

మనము జీవితాంతం హాయిగా ఉండగలం. రేపు మనం సత్యనారాయణస్వామి వ్రతం చేయాలి. ఇదంతా ఆ స్వామి దయ. ఇరుగు పొరుగు బ్రాహ్మణులను, ముత్తైదువులను పూజకు భోజనాలకు పిలిచి వస్తాను. రాజశేఖరంతో కలిసి లలిత స్వామి పూజ చేయాలి. అంతా వైభవంగా జరగాలి. ఏమంటావు?'' అని మగడు చెప్పిన దంతా విని ''అనేదేమిటి? అన్నం అంతా మీరన్నట్లే జరిపిద్దాము. వెంటనే బజారు కెళ్లి కావలసిన సరుకులు పట్టుకొని రండి. నేను యింట్లో యేర్పాట్లు చూసుకొంటా లలితతో కలిసి'' అని నవ్వుతూ చెప్పింది పార్వతమ్మ.

లలితకూడ చాల సంబరపడ సాగింది. ఇల్లంతా అప్పుడే సందడితో కూడినట్లయ్యింది.

''ఏమేవ్, అడుక్కుతింటూ వస్తు ఉండే యీ శంకరయ్య యీరోజు యింత ఆడంబరంగా సత్యనారాయణ వ్రతం చేస్తున్నాడంటే దీని అంతర్యమేమై ఉంటుందంటావు? ఏదైనా నడమంత్రపు సిరి కలిసొచ్చింటావా'' అని పిలకజుట్టు సవరించు కొంటూ కామావధాని ప్రశ్నించాడు భార్య సోమిదమ్మను

అదేమోనబ్బా, దైవానికి తెలియాలి. నాకేమి తెలుసు.'' ఆశ్చర్యం ప్రకటించింది సోమిదమ్మ.

''సరే, నిజం నిలకడమీద తెలుస్తుంది. ఈ ప్రొద్దు పప్పుదప్పడాలతో భోజనం మాట నిజం.''

శంకరయ్య యింట్లో సత్యనారాయణ స్వామి పూజ వైభవంగా జరిగిపోతూంది. ఒకవంక బ్రాహ్మణులు, యింకొకవంక సువాసినులు కూర్చున్నారు. స్వామి ముందు పూజ చేసేందుకు పట్టుచీర, రవికె, బంగారు నెక్లెస్ ధరించి లలిత, ఆమె ప్రక్కన పట్టుపంచె కట్టుకొని, ఉత్తరీయం కప్పుకొని రాజశేఖరం కూర్చున్నాడు. ఆ యువకు డెవరో యింకా ఎవరికి తెలియదు. అతడు అందరి దృష్టుల నాకర్షిస్తున్నాడు. బ్రాహ్మణులు, ముత్తైదువులు గుసగుస పోతున్నారు. అతడెవరు అని వారి సందేహం. తుదకు లలితకు ప్రక్కనే కూర్చున్నాడు కాబట్టి ఆమెకు కాబోయే వరుడేమోనని సమాధాన పడ్డారు.

పూజ ముగిసింది. ప్రసాదం పంపకమయ్యింది. అందరు సుష్టుగా భోంచేసి, తాంబూలాలు తీసికొని, ఎవరి యిండ్లకు వారు పోతున్నారు. ఆ యువకుని సంగతి పార్వతమ్మ నడగాలని ముత్తైదువులు కొందరింకా అక్కడే మిగిలిపోయారు. రాజశేఖరం, వీరారెడ్డి, శాంతయ్య వెళ్ళిపోయారు.

సోమిదమ్మ తిన్నగ పార్వతమ్మ నొక గదిలో కలిసికొని ''మొత్తంమీద బలేదానివే, పార్వతీ. ఎవ్వరికి తెలియకుండ బలేఅల్లుణ్ణి కొట్టేశావు'' అనింది.

పార్వతమ్మ చిరునవ్వు చిందిస్తూ రాజశేఖరం సంగతంతా చెప్పి ''మమ్మల్నేమి చేయమంటావు, పిన్నీ? మా కులంలో వేలకువేలు వరకట్నమిచ్చి వరుణ్ణి తేలేక ఈ వర్ణాంతర వివాహానికి ఒప్పుకొన్నాము'' అని ముగించింది.

సోమిదమ్మబుగ్గలు రెండు నొక్కుకొని ''అవ్వ! ఇదేంటి చోద్యమే పార్వతీ? మన కులంలో వరుడు దొరకలేదని సలక్షణమైన బిడ్డని కాపువాని చేతిలో పెట్టి కులం చెడిపోతారా? మీరు చెడిపొయ్యేదేకాక యీ దినం మమ్మల్నికూడ కుల భ్రష్టుల్ని చేశారే యీ శూద్ర భోజనంతో'' అని గట్టిగా మాట్లాడుతుంటే, మిగిలిన ముత్తైదువులు, బ్రాహ్మణులు లోపలికి వచ్చి, అంతావిని. శంకరయ్య, పార్వతమ్మల మీద విరుచుకు పడ్డారు.

ఎవరెంత కోపంతో మాట్లాడినా, నవ్వినా ఎగతాళి చేసినా ఆ దంపతులు మారు మాట్లాడలేదు. అందరు కాకుల్లా పొడవ సాగారు వాళ్లిద్దరిని.

''ఇదేమి పోగాలమయ్యా మీకు? నీ బిడ్డను కాపువానికే యిస్తావో మాలవానికే యిస్తావో, నడుమ మమ్మల్నందరిని యీ కులభ్రష్టం భోజనానికిపిలచి అవమానించా వెందుకు?'' అని కామావధాని మొదలైన వారు శంకరయ్యను నిలదీసి అడిగారు.

అందరికి శంకరయ్య దొక్కటే జవాబు! ''ఇది మా యిష్టం. ఎవరి కష్టసుఖాలు వారివి''

అవధాని కోపంతో, చిటపటలాడి పోతున్నాడు.

## కలలోని కలిమి

"శంకరయ్యా, ఈ పాడు బుద్ధి నీకే పుట్టిందా? లేక ఎవరైన నేర్పించారా?"

"నన్నేమి చేయమంటారు? పిల్ల వయసెక్కి పోతూంది. మన బ్రాహ్మణుల్లో వరుడు దొరక్క తిరిగి తిరిగి చచ్చాను. ఏ చవట నడిగినా మూడువేలిస్తారా? నాలుగు వేలిస్తారా? అని అడుగుతూంటే, పిండా కూటికే లేని నేను వీళ్లకు వేలెక్కడి నుంచి తెచ్చియివ్వగలను? ఈ దినం కులభ్రష్టుల మయ్యామని యేడ్చే మీ రెవరైనా యే నాడైనా నా కష్ట సుఖాలాలోచించారా? అయ్యో, పాపమని పిలిచి పట్టెడన్నం పెట్టారా? ఇప్పుడేమో మీ కొంపలే తగల పడినట్లు ఆర్భాటం చేస్తున్నారు? కులం కులం— ఎక్కడుందయ్యా మన కులంలో ఐకమత్యం? బతికితే చూచి ఓర్వలేరు— చెడితే చెయ్యి పట్టలేరు— పొండి మీరంతా ప్రాయశ్చిత్తాలు చేసుకో పొండి. ఎవరి కష్టాలు వారివి" అని తెగించి శంకరయ్య అందరిని దబాయించేసరికి, గొణుక్కొంట్లూ అందరు మెల్లగా జారుకొన్నారు.

ఊళ్లో బ్రాహ్మణులంతా శంకరయ్య కుటుంబాన్ని వెలివేసినట్లు చూడసాగారు. శంకరయ్య దాన్నేమి లక్ష్యపెట్టలేదు. "నా బిడ్డకు పెండ్లి చేయాలి. నా దరిద్రం తీరితేచాలు. లలితా, లలితా నీ పెండ్లి వైభవంగా చేస్తానమ్మా!" అని ఆ కడపటి మాటను బిగ్గరగా అనేసరికి పక్కన పడు కొన్న పార్వతమ్మలేచి, మగనిని కుదిస్తూ "ఏమిటండీ ఆ కలవరింతలు? లలిత పెండ్లై నాలుగేండ్లై అది హాయిగా కాపురం చేస్తూ అత్తవారింట ఉంటే, మరి యిప్పుడేమి దాని పెండ్లి వైభవంగా చేస్తా మంటారు?" అని నవ్వింది.

శంకరయ్య దిగ్గున లేచి కూర్చొని కళ్ళు నులుముకొంటూ "పారూ, పారూ పదివేల రూపాయలేవీ?" అని చేయి జాచాడు.

"బలేమంచికలే వచ్చిందండి మీకు. కలలో చూచారా పదివేలు? సరే, కలలోని కలిమి కాలాంతరానికి రాదులెండి" అని పార్వతమ్మ అతన్ని తట్టి హెచ్చరించింది.

"అంతేనా! అంతా కలేనంటావా!" అని చప్పరించాడు శంకరయ్య. 

# ఫెలో డైరి

## నెలకి రు. 2 జీతం!

హజారీబాగ్ అనే వూరిలో అన్వారల్ లనే అతను ఆ రాష్ట్ర ప్రభుత్వపు స్కూలు నైట్ వాచ్‌మన్‌గా నెలకు రెండ్రూపాయల జీతానికి పని చేస్తున్నారట. ఇన్క్రెడిబుల్.

## నగకోసం ఎక్స్‌రే

విరుద్ధనగర్‌కి చెందిన ఒకాయన తన కూతురు బంగారు నగ ఫలానా ఆవిడ కాజేసిందని ఉరకు గట్టి నమ్మకముతో పోలీసులకు ఫిర్యాదు చేశాడట. పోలీసు లామెను వెదికి, దొరక్కపోయేసరికి ఆడవారి చేతామెను మొత్తం వెదికించి, అప్పటికి దొరక్క పోయేసరికి ఎక్స్‌రే తీయిస్తే లోపల గొలుసు కనిపించిందట. వెంటనే ఆమెకు విరేచనాల మందిచ్చి ఆ ఏడొందల రూపాయల నగనూ రాబట్టారట. ఔరా క్రూరారే!

## 20సంవత్సరాలుగా రాష్ట్రపతి!

ఫిన్లండ్ రాష్ట్రపతి ఉర్హో కెకోనెన్ గత ఇరవై సంవత్సరాలుగా ఆ పదవి నిర్వహిస్తున్నారట. ప్రతి ఎన్నికలలోనూ ఆయన సునాయాసంగా నెగ్గుతున్నారట. ప్రపంచ ప్రజా పరిపాలన దేశాలలోనే యిది రికార్డట.

## ము...ము...ముద్దంటే

సినిమాలలో ముద్దు వద్దా కావాలా అనే విషయంపైన ముద్దెట్టుకుంటే పోలా అని కేంద్ర ప్రభుత్వం నిర్ణయం పైన తమిళనాడు ముఖ్యమంత్రి, నటుడు యం. జి. రామచంద్రన్ మాట్లాడుతూ, తమిళనాడు సినిమాలలో ముద్దునెంతమాత్రం తాను ప్రవేశ పెట్టనీయననీ, అటువంటి పరిస్థితి గట్టిగా వచ్చిననాడు తానే ఉద్యమమున్కెదురు నిల్చొని పోరాడుతానని అన్నారట.

## సిటీబస్‌లో ఆఫీసుకి వచ్చే అమెరికా రిజర్వు బ్యాంక్ గవర్నర్!

అమెరికా రిజర్వు బ్యాంకు గవర్నరు విలియం మిల్లరుకు సంవత్సరానికి నాలుగు లక్షల డాలర్లు జీతమట. అయినా సరే ఆయన తన యింటినుంచి ఆఫీసుకు సిటీ బస్సులోనే యీ నాటికీ వస్తారట.

## హస్తలాఘవం!

కోయంబత్తూరు రాజాస్ట్రీటులోని నవుతిండియన్. బ్యాంకు బ్రాంచికి ఓ నన్నటి యువకుడు టిప్‌టాపు డ్రస్సులో వచ్చి అక్కడి క్యాషియరుతో ముచ్చట్లారంభించి, పెంచి, ఆనక బైట అవతలికి పోయాట్ట. అతనెళ్ళాక ఆ క్యాషియరు కొయ్యబారి పోయాడట. కారణం పది హేను వేల రూపాయల రెండు కట్టలు కూడా బైట చెప్పేసి పోయాయట. అయినా వాడి మాటలకు మైకం వచ్చి ఆ క్యాషియరిద్దే పొడ మేస్తి చెప్మా.

## కార్టర్ అనుచరుల సరదా!

అమెరికా ప్రెసిడెంటు కార్టర్ భరద్దేశం వచ్చి నపుడు ఆయనతో వచ్చిన కొందరు సరదాగా ఏనుగెక్కారట. అమెరికా పాలిటిక్సులో ఏనుగు రిపబ్లికన్‌పార్టీ గుర్తట. కార్టర్ పార్టీ అయిన డెమొక్రాటిక్ పార్టీ గుర్తు గాడిదట.

## కప్పకాళ్ళ ఎగుమతి రద్దు

గత సంవత్సరం కప్ప కాళ్ళను విదేశాలకెగుమతి చేసిన ఫలితంగా భరద్దేశానికి 780 లక్షల రూపాయలాదాయం వచ్చిందట కానీ యిప్పటి ప్రభుత్వం యీ ఎగుమతిని రద్దు చేసిందట. అందులకు కారణమేమి! జీవకారుణ్యమా! ఏంరోహటా




అప్పటికి మేము ఊరు వెళ్ళివచ్చి రెండు వారాలు కూడా కాలేదు. మళ్ళీ రమ్మని టెలిగ్రాం వచ్చేసరికి ఆశ్చర్యపోయేను.

మా అత్తగారి ఊరు అమలాపురం దగ్గర ఓ చిన్న పల్లెటూరు శ్రావణ బహుళ ఏకాదశినాడు మా ముసలమ్మగారు పోయేరు. ముసలమ్మగారంటే మా అత్తగారికి అత్తగారు, అప్పుడు ఆవిడకి సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వచ్చింది. మా వారు ఆఫీసులో పదిరోజులు లీవు మంజూరు చేయించుకొని అందరం బయలుదేరి వెళ్ళేసరికి ఆవిడపోయి మూడు రోజులయింది. అసలు ఆవిడ పోయిన తరువాతనే టెలిగ్రాం ఇచ్చేరుట. మమ్మల్ని ఒక్కసారిగా ఖంగారు పెట్టడం ఇష్టంలేక సీరియస్‌గా వుందని ఇచ్చేరుట. సరే ఇంక కర్మలయ్యేదాకా ఉండి వచ్చేం.

ఇప్పుడు మళ్ళీ అత్తగారికి సీరియస్‌గా ఉందని టెలిగ్రాం! కొంపతీసి ఈవిడ కూడా... నాకు ఖంగారు పుట్టింది. ఏం చెయ్యాలో తోచలేదు. మా వారు నాలుగు రోజులు ఆఫీసు పని మీద క్యాంపుకు వెళ్ళేరు. ఆలోచించి ఇంక చేసేదేమీలేక ఇలాటి టెలిగ్రాం రావడం మూలాన మళ్ళీ ఊరికి వెళ్ళవలసి వచ్చిందనీ క్యాంపు నుంచి తిరిగి రాగానే ఆయనను రమ్మనీ ఆఫీసు ద్వారా కబురు పంపించి నేను పిల్లలతో బయలుదేరాను.

ఎంత ధ్యాస మళ్ళిద్దామని ప్రయత్నించినా దారి పొడుక్కూ అత్తగారే కళ్ళ ముందు కనబడుతున్నారు. అత్తగారికి అరవైదాటేయి. అరవైమూడో అరవైనాలుగో ననుకుంటాను.

పదమూడోఏటే కాపురాని కొచ్చేరుట. పదిహేనవ ఏట మా బావగారు పుట్టేరుట. అప్పటినుంచి ఆవిడకి నలభైఎనిమిది దాటే వరకూ వచ్చేకానుపూ పోయే కానుపూను. "పద్నెనిమిది కానుపుల్లో పాము గుడ్లల్లా చెదిరి నలుగురు బ్రతికేరు. పుట్టిన వాళ్ళందరూ బ్రతికేఉంటే ఇంట్లో అందరికీ ఓ పూటయినా పంక్తిని కూర్చోపెట్టి తిండి పెట్టలేక పోయేవాళ్ళం" అంటూండే వారు అత్తగారు. మా వారు ఆవిడకు మిగిలిన వారిలో ఆఖరు సంతానం. ఆయనకు ఇప్పుడు ఇరవైఎనిమిది నిండేయి. మా బావగారికీ వారికీ మధ్య మా యిద్దరాడపడుచులు. పెద్దావిడకి నలుగురు పిల్లలు. చిన్నావిడని ఊళ్ళోనే ఇచ్చేరు. ఆవిడకి ఇంకా ముప్పై దాటేయోలేదో ఇప్పటికి నలుగురు ఆడపిల్లలూ ఇద్దరు మగపిల్లలూను— అత్తగారి పోలికే వచ్చిందంటారు.

# ఉచితం




# కీ డిటర్జెంట్

# బిజ్ తోమే పౌడర్‌తో

| కొనే ప్రతీ బిజ్ ప్యాక్ బరువు | ఉచితంగా లభించే కీ ప్యాక్ బరువు |
|---|---|
| 500 గ్రా. | 50 గ్రా. |
| 600 గ్రా. | 50 గ్రా. |
| 1.2 కి.గ్రా. | 50 గ్రా. |
| 3.0 కి.గ్రా. | 100 గ్రా. |

త్వరపడండి!
సరుకు ఉన్నంతవరకే ఈ కానుక




గోద్రెజ్ ఉత్పాదన

# బిజ్ చక్కటి పొదుపు కోసం

CASGS-117-244 TL

"ఆపరేషన్ చేయించుకోండి - ఏం భయం లేదు. నేను చేయించుకోలేదా !" అన్నాను ఓసారి ఆరునెలల క్రితం.

కాని వాళ్ళ అత్తారివాళ్ళకి ఆపరేషన్లూ అవీ ఇష్టం లేవుట—పోనిద్దూ అనేశారు ఆవిడకేమీ బాధలేన్నట్లుగానే మరిలా ఎన్నాళ్ళుండగలరో ఏమిటో!

మాముసలమ్మగారి విషయంలో మాత్రం ఏమయింది! ప్రాణం పోవడానికి ముందు మంచం మీద ఉన్న మూడు రోజులూ తప్ప ఆవిడ కనీసం రెండు సార్లు స్నానం చెయ్యని రోజేదీ!... పదిహేనురోజుల ముందే జంతికలు కూడా చేసుకొని స్వంతపళ్ళతో తిన్నారుట!...మాఅత్తగారు పై పళ్ళుకింద పళ్ళూ కట్టించుకున్నారు. నామటుకు నాకు ఓ పన్ను డొల్లయి తీసితిననివ్వదు... ఎంతయినా వాళ్ళు పాతకాలం మనుషులు... మరి అటువంటావిడే హఠాత్తుగా వెళ్ళిపోలేదూ? బహుశా అత్తగారికి కూడా అటువంటిదేమయినా అయిందేమో... ఇప్పటికి కూడా అత్తగారు రోజూ పూజకు కూర్చున్నప్పుడు చూస్తే... పూర్తిగా తెల్లబడిన జుట్టు, పట్టుచీర ముదురు నీలం రంగుకు పోటీగా దబ్బపండు లాంటి ఆవిడ శరీర ఛాయ, పసుపురాసి ముఖానికి రూపాయి బిళ్ళంత కుంకుమ బొట్టు, భక్తితో ధ్యానంలో మూసిన కాటుక కళ్ళు. స్త్రీత్వం అంతా పోతపోసినట్లు ఈ ముత్తయిదువలోకి దిగిందా అనిపిస్తుంది. సింహాసనంలో వెండి విగ్రహాల ముందు దీపం వెలుగులో బంగారు విగ్రహంలా ఉంటారు!...ఆవిడ విషయంలో మా మామగారూ, ఆవిడ సంతానమూ, వాళ్ళవిషయాల్లో ఆవిడ బాధలూ బాధ్యతలూ ఒక ఎత్తూ, ముసలమ్మగారు ఒక ఎత్తూనూ.

ముసలమ్మగారిని మొదట నా పెళ్ళిలో చూసేను. మనిషి హుందాగా ఏనుగులా ఉండేవారు. కాని ఆ రెండు రోజులూ మాత్రం అంటీ ముట్టనట్లుగా తెల్లగుడ్డ ముఖంమీదికి లాక్కొని ఇష్టంలేని చోటికొచ్చినట్లు ఓ మూలకు కూర్చునేవారు. ఆవిడకేం లోటు వస్తుందోనని అత్తగారి దృష్టంతా ఆవిడమీదే ఉండేది. ఉన్నట్లుండి ఆవిడదగ్గరికెళ్ళి ఓ సారి చూసి వస్తూండేవారు. ఈ విడను చూపులతోనే తినేసేట్లు చూసేవారు ఆవిడ.

## శత్రు బంధం

పెళ్ళిలో ఆఖరి పూట ముసలమ్మగారు భోజనం చెయ్యలేదని తెలిసింది. అనుకున్నంతా అయిందని మొత్తుకున్నారు అత్తగారు. చివరకు ఆవిడకు ఆచారంలో ఏదో తక్కువయిందని తేల్చేరు మిగిలినసందడితో చికాగ్గా ఉన్న మామగారు తల్లిని మందలించబోతే అత్తగారు ఆయననోరు బలవంతాన నొక్కి తనే ఆవిడ దగ్గరకెళ్ళి ప్రతిమాలేరు. ఎవరెంత ప్రతిమాలినా ఆవిడ ససేమిరా అంది. చివరకు ఎలాగో మధ్యాహ్నం పన్నెండు గంటలకు అత్తగారు స్నానంచేసి వండగా రెండు గంటలకు ఆవిడ భోజనం అయింది. ఆ రోజు ఏదో పొరపాటు జరిగి వుండవచ్చనీ ఆఖరుకు సర్దుకు పోయిందికదా అనీ అనుకున్నాను కాని దాని పూర్వాపరాలు అప్పటిదాకా నాకు తెలియవు. తరువాత మనుగుడుపులకు అత్తవారింటికెళ్ళి తిరిగి మా వూరికి బయలుదేరేముందు అగ్ని పర్వతం బద్దలయ్యింది.

ముసలమ్మగారు నూతి దగ్గరకు స్నానం చేయడానికి వెడుతూ కూరలు తరుగుతున్న అత్తగారి దగ్గర ఆగి "ఆ నెమలికంఠం రంగుచీర ఎవరికి పెట్టేవు... గంధం రంగు చీర ఎవరికి పెట్టేవు... " అంటూ మామూలుగానె మొదలు పెట్టి తరువాత దాని ఖరీదెంత దీని ఖరీదెంత అనీ ఆరాలు తీసి కొంచెం కంఠం పెంచి చివరికి పెళ్ళికొచ్చిన ముసలమ్మగారి సవతి తమ్ముడు మనుమరాలికి పెట్టిన కలనేత చీర మిగిలిన చీరలకంటె రెండు రూపాయలు తక్కువని తేల్చేసేరు. ముసలమ్మగారు పెట్టిన బోను లోకి తెలియక ఉత్సాహంగా నడిచిన అత్తగారు మూతపడగానె తెల్లబోయారు.

ముసలమ్మగారు ఇంక అక్కడ నుంచి అత్తగారు కాపురాని కొచ్చినప్పటి నుంచి చేసిన నేరాల లిస్టు చేతిలోవున్న బాల్చీకి, దారిలో ఎదురొచ్చిన పెరటి గుమ్మానికి, దాని తలుపుకూ, తలుపుకున్న గడియకూ, నూతిలో నీళ్ళకీ, చుట్టూవున్న చెట్టుకీ పుట్టకీ, బట్టలారేసే దండేనికీ, వంటింట్లో పొయ్యికీ, పొయ్యిలో రాజేసిన నిప్పుకీ వినిపించి పొయ్యి ఊదుతూ ఊదుతూ మధ్యలో అన్నారు... "అసలు నీ కొడుక్కి పెళ్ళి కుదిరినప్పటినుంచీ నీకు కళ్ళు నెత్తి

మీద కొచ్చేసేయే! నువ్వు కిందామీదా పున్ను తున్నావా! మేమూ కథలూ కార్యాలూ చేసేం కాని ఇంలింత అలిశయాలూ, చుప్పనాతి గుణాలూ ఎరగవమ్మా! గుంటది రాక రాక పదిసార్లు కబురంపితే వచ్చింది దానికి నువ్వు చేసిన మర్యాదకి నాకు తల కొట్టేసి నట్లనిపించింది... అయినా నీ స్వభావం తెలిసి దాన్ని పిలవడం నాదే బుద్ధితక్కువలే. ఇంకా వాడూ సరే! పెళ్ళాం వెనకాల తందాన తాన అంటూ... అయినా నిన్నను కోవడం దేనికిలే... మన బంగారం మంచి దయితే ఒకళ్ళని అనుకోవడం దేనికి!... అంతా నీ చేతిలో పెట్టేదు పేనుకు పెత్తనం ఇస్తే తలంతా తెగ కొరికిందని'' చెప్పెతూ ఉఫ్‌మని ఊదేసరికి పొయ్యి భగ్గున మండింది.

అంతవరకూ వినీ విననట్టు ఊరుకున్న అత్తగారికి అరికాలి మంట నెత్తికెక్కింది. ఆవిడా అందుకున్నారు.

''...అవును. ఈ పెళ్ళి కుదిరినప్పటి నుంచీ నేనూ చూస్తూనే వున్నాను. వాళ్ళు నాకు అన్ని మర్యాదలూ చేస్తూంటే చూడ లేక కళ్లల్లో నిప్పులు పోసుకొని నేనూ నా కొడుకూ ఎక్కడ సుఖపడి పోతామోనని ఉడికిపోతున్నారు. అందరి మధ్యా పోని మర్యాదగానే ఉందాం అని వినీ విననట్లు ఊరుకుంటే అసలు మనిషిని బ్రతకనిస్తేనా అక్కడా... ఆచారం తక్కువయిందంటూ మిట్టమధ్యాహ్నం పెళ్ళి పందిట్లో నాచేత స్నానం చేయిస్తే కాని మీ కడుపు మంట చల్లారలేదు... అయినా అన్నింటికీ అంత అహంకారం పనికిరాదు...''

అనుకోని ఈ సంఘటనకి మావాళ్ళంతా తెల్లబోయారు నేను మావారి దగ్గర కెళ్ళి మెల్లగా సర్దిచెప్పండి అన్నాను.

''మండుతూన్న పుల్లల్ని కదిపితే మంట పెద్దదవుతుంది. ఇది తెలియక చాలామంది ఇప్పటి వరకూ ఈ మంటల్లో చేతులు కాల్చుకున్నారు. ఎప్పుడూ వాళ్ళ మధ్యకు వెళ్ళకు. ఇది ఈ ఇంట్లో నువ్వున్నన్నాళ్ళూ శ్రద్ధగా గుర్తుపెట్టుకోవలసిన మొదటి విషయం.'' అన్నారాయన.

మరో అరగంటకు మంటలు చల్లారేయి. ముసలమ్మగారు వంట మధ్యలో వదిలేసి వేరే పొయ్యిలో నిప్పు వేసుకున్నారు.

భోజనాలయి వెళ్లేటప్పుడు గడప దాట బోతూంటే పెరట్లో నిద్రపోతున్నట్టు పడుకున్న ముసలమ్మగారికి చెప్పిరమ్మని అత్తగారు గుర్తు చేశారు.

నేను గతుక్కుమని వెళ్లి ''వెళ్లొస్తానండి మామ్మగారూ'' అన్నాను.

''ఈ యింట్లో నే నెవత్తెనమ్మా ముసిలిముండను! మీ అత్తగారికి చెప్పి వెళ్ళు.'' అని ముఖం తిప్పుకున్నారు. అంతేలే వన్నట్టు చూసివచ్చెయ్యమని సంజ్ఞ చేసేరు అత్తగారు. వచ్చేక ''ఇప్పుడే కాస్త మాటా అనకబోతే బ్రతికున్నన్నాళ్ళూ నీ ప్రాణాలు లోడేసేదావిడ!'' అన్నారు.

ఆ తర్వాత కాపురాని కెళ్ళిన తర్వాత తెలిసింది ముసలమ్మగారు రెండు రోజులు పెద్ద వంటలోకి వస్తే వారంరోజులు తన సోడిడా తను వేరే ఉడకేసు కుంటారని. మేము ఊరికి వెళ్ళినప్పుడల్లా సామాన్యంగా జరిగే సంఘటన ఒకటుంది. అప్పటికి ముసలమ్మగారు వేరే వండుకుంటూంటే మా భోజనాలు అవుతూండగావచ్చి కాస్త కూరా, పచ్చడీ, పులుసూ తీసుకొచ్చి కారణం చెప్తూన్నట్టుగా ''మీ అత్తగారు ఉప్పు ఎక్కువ వేస్తుందనో, పచ్చడి మెత్తగా రుబ్బదనో, పోపు మాడుస్తుందనో'' ... ఓ మాట చెప్పి చివరకు ''మీ ఆయనకు నా వంట సొక్కదులే! వాడికి వాళ్ళమ్మే వండి పెట్టాలి! దాని చేతి వేళ్లల్లోంచి అమృతం దిగుతుంది వాడికి...'' అనేసి వెళ్ళిపోయే వారు.

''నీ వంటే బాగుంటుందినాయనమ్మా'' అని మా వారు తొందరపడి అరచినా ''నువ్వలాగే అంటావులే ముఖస్తుతికి'' అనేస్తారు.

ముసలమ్మగారు వంట కాగానే ఓసారి నైవేద్యం పెట్టి తను తినేసి వీధిలో పడతారు. అందులో ఆవిడ వేరే వండుకున్నప్పుడు ఇంకా కాస్త తొందరగా అయిపోతుంది.

మా అత్తారింటికి ఎదురుగా రెండిళ్ళ వతల పెద్ద అరుగుల ఇంటి దగ్గర, సమావేశంలో భోజనం అయినప్పటి నుంచి సాయంత్రం మూడున్నర నాలుగు గంటల




దాకా ముసలమ్మగారి డ్యూటీ. సాధారణంగా ఈవిడే ముందు వెడతారు. మిగిలినవాళ్ళు వచ్చేదాకా రోడ్డుమీద ఎవరూ ఆవిడతో మాట్లాడకుండా వెళ్లడానికి వీలుండదు. ఏదో ప్రశ్నకి జవాబు చెప్పి. వెళ్ళాలి. ఆవిడ ప్రశ్నలకు ఎవరూ సాధారణంగా ఆగి జవాబు చెప్పరు, ఆగేరా అంతే సంగతులు.

మెల్లగా శేషప్పా, సోదెమ్మా, సుబ్బప్పా ...ఆవిడ ఉన్నంతవరకూ ఒక్కక్కళ్ళే వచ్చి చేరుతారు. ఇంక ఊళ్లో పెద్దమనుషుల్ని, వద్దంటూన్నా వినిపించుకోకుండా నాకూ మా వారికీ విస్తట్లో వేసేవారు. తరువాత అడిగేవారు ''ఏమేపిల్లా! మీ అత్తగారి వంట బాగుందా! నా వంట బాగుందా!'' అని. నాకు గొంతులో వెలక్కాయ పడ్డట్లు య్యేది. అడకత్తెరలో పోకచెక్కలా తెల్లబోయి వంటింట్లోకి చూసేదాన్ని. నా పరిస్థితికి నవ్వాపుకోలేక అత్తగారు ఏదో సైగ చేసేవారు

''మీ వంటే బాగుంటుంది'' అని గొణిగేదాన్ని ఇబ్బందిగా. నా అభిప్రాయానికి

వాళ్ల వ్యవహారాల్నీ కొడుకుల్నీ కోడళ్ళనీ ఆడపడుచులనీ...ఎవళ్ల ఆవేశాల్ని బట్టి వాళ్ళు ఏ కత్తి దొరికితే ఆ కత్తితో కోసిపారేస్తాను. ఒకళ్ళ నివేదన అయ్యేలోపల మరొకరు వూపిరి నింపుకుంటూ వుంటారు. ఇంక మా ముసలమ్మగారి దాడిలో మటుకు ఎటు నరుక్కొచ్చినా అత్తగారినే.

"...నిన్న ఉపోషం ఉన్నారు మీరెందుకు నేను స్నానంచేసి వండుతానంటూ ఈవేళ మా కోడలు వంట. పప్పులో ఉప్పెక్కువ. పులుసు పులుపు రొద్దు. వంకాయ కూర ఓ ముక్క ఉడికింది. ఒకటి ఉడకలేదు. ఊరగాయముక్క వేసుకొని ఆ పుల్లమజ్జిగే కాస్త పోసుకు లేచివచ్చేను. ఇదేం వంటే అంటే నా వంట మీ రో సారి మెచ్చారా అంటూ ఇదో తగవు! నాకెందుకమ్మా నేనో బుద్ధిలేనిదాన్ని. నా సోలెడూ నేను పెట్టుకోక నాకెందుకు చెప్పు..."

"...మొన్న చిరుతవూడి వెళ్ళినప్పుడు చిల్లులుపడి ఇంట్లో ఉన్నాయి అనీ ఓ కూరగిన్నీ ఓ అన్నంగిన్నీ మాటించుకొచ్చేను. మా కోడలు ఈవేళ అప్పుడే కూరగిన్నె పొయ్యి ఎక్కించేసింది. నేను మాటించేను నువ్వెందుకు తీసేవే అన్నానంతే! నువ్వు మాటిస్తే నీదైపోతుందా! అవసరం వస్తే వాడుకోమా! అంటుంది. మరి అటువంటిది తనెళ్ళి మాటించుకు రాలేకపోయిందా!..."

"జంతిక ముక్క కొరికి చాలా రోజులయింది, పోనీ నాలుగు చుట్టలు తిప్పొదామని వరిపిండి ఉందిటే అన్నాను మొన్న. వరిపిండి ఎక్కడిదండీ అని ఖాళీ డబ్బా చూపించింది ముద్దుల కొడుకు హైదరాబాదు నుంచి వచ్చేడని ఈవేళ జిలేబీ చేస్తోరా అంది. వరిపిండేమిటి పేగుంటే ఎక్కడలేనివీ పుట్టుకొస్తాయి!... అవునులే కన్నకొడుకుమీద ఉన్న పేగు అత్తమీదెలా వుంటుంది!..."

"...అడక్క అడక్క రెండు పంచెలు తేరా అన్నాను మా వాడితో. మా కోడలు దత్తుల్ని దూసినట్లు చూసింది. వాడితో ఏం చెప్పిందో ఏమో! ఈవేళ తెచ్చేడు దుంగల్లా దుప్పటీ గుడ్డల్లా ఉన్నాయి. అసలే అవాలు ఉడిగిన నేను వాటిని మొయ్యకలనుటమ్మా!... చివరకు కట్టుకొనే గుడ్డ దగ్గర్నుంచీ కరువైపోయిందనుకో!..."

## శత్రుబంధం

"... నా దగ్గర నాలుగు రోజులుండి వెళ్ళమంటూ కొడుకు ఉత్తరం రాసేడుట. ఆవిడ తయారవుతూంది ఈ ముసలి ముండ ఎలా ఛస్తే ఎవరికి కావాలి! అవతలికి పో అని వీధిలోకి తోసేస్తే ఊళ్ళోవాళ్ళు ఏమయినా అనుకొని పోతారని రెండు మెతుకులు ఇంట్లో తిననిస్తున్నారు కాని దీని పీడఎప్పుడు విరగడవుతుందా అని ఆలోచిస్తున్నారు.

సాయంత్రం సందెగుమ్మాలు తుడిచేవేళ అత్తగారు ఓ సారి ఆ అరుగువైపు చూస్తారు మిత్రబృందం ఎవరైనా ఉంటే "ఏమన్నారేమిటి మా అత్తగారు?" అంటారు.

ముసలమ్మగారు చెప్పింది మరింత హావభావాలతో మరింత సాగదీస్తూ అందిస్తారు అవతలి వాళ్ళు. "ఏం చేసుకున్నా ఓర్వలేని మనిషి. ఆవిడని నీఅంతటిది లేదంటూ నెత్తిమీద పెట్టుకున్నాంగానీ పూచిక పుల్లంత లోటు చేసేమా! ఇన్నీ చేస్తేనే ఇలా ఉన్నారు నిజంగా గడప తొక్కద్దనే వాళ్ళే వచ్చిఉంటే అన్ని సంబడాలూ తీరేవి!" అని ముసలమ్మగారి మాటలకు విరుగుడు మాటవేసి వచ్చేస్తారు అత్తగారు.

వాళ్ళిద్దరూనవ్వుతూ మాట్లాడుకోవడం నేను చూసింది ఒక్కసారే?. ఆ రోజు ముక్కోటి ఏకాదశి ఇద్దరూ స్నానాలు చేసి పట్టుగుడ్డలు కట్టుకొని ప్రక్కదొడ్లో చిక్కుడు పాదుకింద కూర్చున్నారు. ముసలమ్మగారు భాగవతంలో కథలు చెప్తున్నారు అత్తగారు వింటున్నారు. ఆదృశ్యం చూసేసరికి నాకళ్లనునేనే నమ్మ లేక పోయాను. ఓ ప్రక్క హోరున వర్షం కురుస్తూంటే మరోపక్క చెదిరి మబ్బుల్లోంచి పొడిచిన నీ రెండలా ఉంది. చేష్టలు దక్కి అలాగే విల్చుండి పోయేను

ముసలమ్మగారు చెప్తున్నారు.

"- - -విష్ణువును చూడడానికి అడ్డు పెట్టేరని ఆ ముని జయవిజయుల్నిద్దర్నీ భూలోకంలో పుట్టమని శాపం పెట్టేడు. వాళ్ళిద్దరూ వెళ్ళి విష్ణువు కాళ్ళమీద పడి మహాప్రభో మాకీశాపాన్నుంచి విముక్తి చూపించండి—మేము మీకు దూరంగా ఉండలేం అన్నారు. అప్పుడు విష్ణుమూర్తి నేను భూలోకంలో అవతారం ఎత్తుతాను ఆరుజన్మలు నాకు మిత్రులుగానైనా ఉండండి—మూడు జన్మలు శత్రువులుగానైనా ఉండండి ఆ తర్వాత మీకు శాపవిముక్తి అవుతుంది అన్నాడు మిత్రులుగానైనాసరే ఆరుజన్మలు మీకు దూరంగా ఉండలేం అందుకని శత్రువులుగానేపుడతాం అన్నారు. వాళ్ళే హిరణ్యాక్షహిరణ్య కశిపులూ, రావణ కుంభకర్ణులూ, శిశుపాల దంతవక్త్రులూనూ—విష్ణువు అవతారాలెత్తి వాళ్ళను సంహరించి తనలో ఐక్యం చేసుకున్నాడు."

"మూడుజన్మల శత్రుత్వం కంటే ఆరు జన్మల మిత్రత్వం సుఖంగా ఉండేది కదా! వాళ్లలా ఎందుకు కోరుకున్నారో! ..." అత్తగారి సందేహం.

"ఎందుకంటే మిత్రత్వంలో ఓ సారి కాకపోతే ఓ సారయినా ఆయన్ని మరచి పోతారు. శత్రుత్వంలో అయితే కన్ను మూసినా కన్ను తెరిచినా ఆయనే కనబడు

### అంతర్జాతీయ బాలల సంవత్సరం

అంతర్జాయ బాలల సంవత్సరంగా ప్రకటించబడిన 1979 లో యీ భూగోళంలోని సమస్త బాలల హక్కుల కోసం నూతన నిర్దిష్ట కార్యాచరణ పోరాట రూపాలను చేపట్టడానికి అంతర్జాతీయ మహిళా సమాఖ్య సర్వ కృషి చేస్తుందని ఆ సమాఖ్య ప్రధాన కార్యదర్శి ఎఫ్. ఎడెల్‌మాన్ ఒకపత్రికా ప్రకటనలో స్పష్టం చేశారు.

"సమస్త బాలల శాంతియుత, సురక్షిత భవిష్యత్తు కోసం" ప్రపంచ మహాసభ జరపడం ఒక ప్రధాన సంఘటనగా వుండగలదని ఆమె పేర్కొన్నారు. ఈ సంవత్సరం మార్చి 8వ తేదీ అంతర్జాయ మహిళా దినోత్సవం అంతర్జాతీయ బాలల సంవత్సరానికి సన్నాహాలు చేసే ఆశయంతో జరుగుతుందని ఆమెచెప్పారు ఇది మన భూగోళంలోని బాలలతో ప్రధానంగా దక్షిణాఫ్రికా, చిలీల లో అరెస్టయిన దేశభక్తుల బిడ్డలతో క్రియాశీల సంఘీభావ దినోత్సవంగా జరుగుతుంది.

# స్త్రీల వాహనమా?

## పరిశీలించి చూడండి, దీనిపై ఎక్కువగా ఎవరు పయనించుతున్నారో మీకే తెలియగలదు!

ప్రయాణానికి సౌకర్యమైన మరియు ఆదాయకరమైన వాహనం మోపెడ్. కాలాన్ని, ధనాన్ని ఆదాయపరిచే విషయంలో పురుషులైనాకానీయండి, స్త్రీలైనాకానీయండి యావన్మందీ మోపెడ్‌నే ఎన్నుకుంటారు.

మీకు లభించేవానిని పరిశీలించండి. ఖచ్చితమైన బ్యాలెన్సుకు, రోడ్డు పట్టుకు అనువుగా పొందుపరచబడిన బాడీ. వాహనానికి కుదుపులమూలంగాను, ప్రయాణంవల్లను కలిగే అలసటను నివారించుటకై టెలిస్కోపిక్ ఫోర్క్ ఫ్రంటు. హరాత్పరిణామాలను చక్కగా నిభాయించుకోగల ట్యూబ్యులర్ ఫ్రేము. సుఖంగా పయనించుటకు అనువైన హ్యాండిల్ బార్‌లు మరియు స్వల్ప వ్యయంలో అధిక మైలేజి నిచ్చుటకు శ్రేష్ఠమైన కార్బ్యురేటర్. మరి ఒక లీటర్ పెట్రోలుకు 70 కిలో మీటర్లు పయనించగలదు. ఇంకాకూడా మోపెడ్ స్త్రీల వాహనమేనవే నమ్ముతారా!

దీర్ఘంగా ఆలోచించి చూడండి. మీ అభిప్రాయాన్ని తప్పకుండా మార్చుకోగలరు.



విక్రయదార్లు లేని చోట్ల విక్రయదార్లు కావలెను.



## మయూరం

## -మీరు సిద్ధంగా వున్నప్పుడు పొందగలిగే ఒకే ఒక మోపెడ్

**తమిళనాడు మోపెడ్స్ లిమిటెడ్**

(తమిళనాడు స్మాల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ లిమిటెడ్‌వారి ఒక [illegible] సంస్థ)
ఇండస్ట్రియల్ ఎస్టేట్, గిండీ, మద్రాసు 600 032.

FDS TML 2653A TEL.

# శత్రుబంధం

తూంటాడు. అందుకని అనుక్షణమూ ఆయన్ను స్మరించినట్లే అవుతుంది. అందుకవే వాళ్లకుతొందరగా మోక్షం ఇచ్చేసేడు.

"అసలు శత్రువు స్మరించినట్లు స్మరిస్తే అది భక్తి ఎలా అవుతుంది. అసలు మోక్షం ఎలావస్తుంది ? ... మీరు కథ ఏమయినా మరచిపోయేరేమో ! "అత్తగారికి నమ్మకం కుదరలేదు.

"నాకే భాగవతం రాదంటావుటే ! గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందట !" అన్నారు ముసలమ్మగారు. ఆవిడ మాటలింకా అత్తగారి మెదడులోకి పోలేనట్టుంది. ఆవిడింకా కథను గురించే ఆలోచిస్తున్నారు... "అసలు శత్రుత్వంతో ఎలా బ్రతుకుతారండీ ! వాళ్ళు ఆరుజన్మలే కోరుకొని ఉంటారు ! శాపం కనుక శత్రుత్వపు జన్మలు ఇచ్చి ఉంటాడు విష్ణుమూర్తి"

"చాల్లేపర్వపురోజుకూర్చొనిభాగవతాన్నే కాదనేటి దానవు నీతో నాకేమిటి ! దేవుడంటే నమ్మకంఉన్న వాళ్ళెవరూ ఇలా మాట్లాడరు. ..." అని లేచి పోయేరు ముసలమ్మగారు.

"నేను మాత్రం ఏమన్నానండీ ! మీరు మరచిపోయేరేమో అన్నాను. ఏదో గిల్లి కజ్జాపెడితే కాని మీకు తోచదు. ..." ఉక్రోషంతో అన్నారు అత్తగారు.

"మొన్నా ఇలాగే అన్నావు..." ముసలమ్మగారు విషయం మార్చేశారు. వేరేగొణుగుళ్ళు మొదలు అయ్యేయి. ఒకళ్ళవి ఒకళ్ళకి వినబడినప్పుడు దెబ్బలాట్లు కేకలతో ఉరుములు మెరుపులూ మొదలయ్యేయి. విచిత్రంగా వచ్చిన ఎండపొడ ఇట్టే కప్పడి పోయింది. హెూరున వర్షం మొదలయింది. మంటల్లో మెరిసిన మంచుముత్యం కాస్తా ఆవిరై ఆకాశాని కెగిరి పోయింది.

రెండేళ్ల క్రితం ఆఫీసు వాళ్ళిచ్చిన అప్పుతో మావారు ఇల్లు కట్టేరు. ఇలా వాళ్లబ్బాయి హైదరాబాదులో ఇల్లు కట్టుకున్నాడని అత్తగారు అందరితోనూ చెప్పుకొని సంబరపడి పోయేరు. మావారికి కూడా తల్లి సంతోషం చాలా తృప్తినిచ్చింది. గృహప్రవేశం ఓ పదిరోజు లుందనగా వచ్చి తరువాత మరో పది రోజులు ఉండి వెళ్లాలని పట్టుగా వ్రాసేరు మావారు. సరిగా వారం రోజుల ముందు మామగారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది, అనుకోని పనుల వలన ఆలస్యమైందనీ ఇంకో రెండు మూడు రోజుల్లో వస్తున్నామనీను. మరో మూడు రోజులు పోయేసరికి మావారి మనసు మనసులో లేదు. అమలాపురం ఎవరికో టెలిఫోనుచేయించిఆరోజే అత్తగార్ని మామగార్ని ముసలమ్మ గార్ని ప్రయాణం చేయించమన్నారు. అయినా ఎవరూ రాలేదు. చివరకు రేపు గృహప్రవేశంఅనగా మామగారొక్కరూ వచ్చేరు. "ఇదేమిటి నాన్నా! అమ్మా నాయనమ్మా ఏరీ?" అన్నారు మావారు తెల్లబోతూ.

"నాయనమ్మకి వంట్లో బాగులేదు. అమ్మ రావడానికి వీలు లేకపోయింది" అన్నారాయన. అందరూ ఉండి అత్తగారు లేకపోయేసరికి ఆయన ఉత్సాహం అంతా చచ్చిపోయింది. యాంత్రికంగా ఏదో అయిందనిపించేరు.

ఓ నెలరోజుల తర్వాత అత్తగారు వచ్చినప్పుడు మావారు బాధగా అడిగేరు. "నీకంటె నాకెవరున్నారమ్మా! నువ్వు రాకపోతే నాకెలా వుంటుంది? కనీసం ఆ ఒక్కరోజూ వచ్చి వెళ్లిపోయినా నాకు మనస్సు సంతృప్తిగా ఉండేది."

"నా ప్రాణాలన్నీ ఇక్కడే వున్నాయి కదురా! అక్కడున్నానన్న మాటేకాని ఈపాటికి పీటలమీద కూర్చుంటారు, ఈపాటికి భోజనాలవుతూంటాయి, అని నిముషాలూ, సెకన్లూ లెక్కపెట్టుకుంటూనే ఉన్నాను... ముసలమ్మగారు కదలనిస్తేనా! చివరివరకూ "ఉండండి నేనూ వస్తాను. మనవడు ఇల్లు కట్టుకున్నాడంటే నాకు సంతోషం కాదా" అంటూ ఆట్టేఉంచి చివరకు "నాకు ప్రాణాలు పోతున్నాయి. నువ్వు వెళ్లేవంటే ప్రాణాలు విడుస్తాను" అని కూర్చుంది. అసలే పెంకి మనిషి. కాదని వచ్చేస్తే అన్నంతపనీ చేస్తుందేమో ఇదెక్కడి అప్రతిష్ఠ అని ఉండిపోయేను" అన్నారు అత్తగారు దీనంగా.

ఇన్ని పోట్లాటలు రోజూ నడుస్తున్నా ఆ యింట్లో ఎవరికే లోటూ జరుగదు. ఓసారి అత్తగారి కెందుకో మోకాలు వాచి మునుచుకోనియ్యలేదు. మామూలుగా ఆ ఊళ్లో ఓ దెబ్బ తగిలినా కాలు బెణికినా

(42 వ పేజీ చూడండి)

# రాగమాలిక

శ్రీమతి
మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

(గత సంచిక తరువాయి)

ఆరు నెలలుగా మర్చిపోయిన స్త్రీ స్పర్శ ... ...

నేను తాగిన విస్కీ ...

నా మనసు విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయింది! పొరపాటు జరిగిపోయింది!

జీవితంలో దిద్దుకోలేని పొరపాటు జరిగిపోయింది — ఒకే ఒక బలహీన క్షణం! నేను తాగకుండావుంటే...? అసలా అలవాటే లేకుండా వుంటే... ఎంత బావుండేది? ఆ తరవాత నేనెంత కుమిలిపోయానో — ఎంత చిత్రవధ ననుభవించానో చెప్పినా ఎవరికీ అర్థం కాదు.

నన్ను నేనే అసహ్యించుకున్నాను. ఆమె మొహం చూడ్డం పూర్తిగా మానేశాను. కానీ, ఆమె నన్నొదలలేదు.

"మీ ఇండియాలో — ఒక్కసారిట్లా జరిగితే— ఆ స్త్రీని తప్పకుండా పెళ్లి చేసుకోవాలిటగదా?" అనడం ప్రారంభించింది.

భారతదేశపు భర్తలైతే భార్యలకి విధేయులుగా వుంటారుట అందుకని కొంతమంది ఆంగ్ల వనితలకి భారతదేశపు భర్తలమీద మోజుట!

ఆనీ — రోజుకి చాలాసార్లు ఫోను చేసేది. ఎద్దన్నా నా రూముకి వచ్చేది.

పెళ్లి చేసుకుంటేగాని వీల్లేదని పట్టుపట్టింది. నాకు ఒక పెళ్లయినా తనకు అభ్యంతరం లేదంది

తన తల్లిచేతగూడా చెప్పించింది.

వదిలించుకోలేకపోయాను.

అందుకనే... అందుకనే... తప్పనిసరి పరిస్థితిలో మా పెళ్లయింది..."

నేనే పరిస్థితిలో ఉన్నానో నాకే తెలియకుండా పోయింది. శిలాప్రతిమలాగా వుండిపోయాను నేను!

ఆయన ఇదేమీ గమనించలేదు.

"తరువాత ఆర్నెల్లూ మేము కలిసేవున్నాము. మొన్న వచ్చేటప్పుడు నాతోనే ఇండియా వచ్చింది. బొంబాయిలో వుందిప్పుడు.

మంజూ - నీకు అన్యాయం చెయ్యాలని నేను కలలో గూడా తలచలేదు మంజూ! అనుకోకుండా జరిగిపోయింది యిట్లా — నన్ను క్షమిస్తావా — మంజూ..."

నా మెదడు మొద్దుబారిపోయింది!

"మంజూ నీ కంగీకారమైతే... మంజూ — అందరం కలిసే... వుండచ్చు!

ప్లీజ్ మంజూ—నన్నర్థం చేసుకో! నీకేవిధంగానూ లోటు రానీను. నీ కన్యాయం చెయ్యను. నిన్ను ఎప్పటికంటే గూడా ప్రేమగా చూసుకుంటాను. ఆ పాపిష్టి క్షణం ఎట్లాంటిదో కానీ — తప్పించుకోలేని బంధం పడింది — నువ్వే చెప్పు — ఒకసారి తొందరపడ్డాక ఆమెని పెళ్లి చేసుకోడం— నా ధర్మం అనిపించింది — అది నా తప్పంటావా? తొందరపడడం నా తప్పే! ఒప్పుకుంటాను. కానీ — అయిపోయినదానికి నేనిప్పుడు ఏం చెయ్యగలను?

ఏమంటావు? చెప్పు మంజూ, నన్ను నమ్ముకుని నాతోనే వచ్చేసింది ఆనీ తనకీ అన్యాయం చెయ్యలేను. మిమ్మల్నీ... మీరు...మీరు ముగ్గురూ నా ప్రాణాలు — మంజూ — మంజూ... నా తప్పుకి నువ్వే శిక్ష వేసినా సహిస్తాను. ఆనందంగా భరిస్తాను నన్ను క్షమించు మంజూ... ప్లీజ్ నన్ను క్షమించు... నువ్వు క్షమిస్తేగానీ... నేను శాంతిగా వుండలేను.

ఇది చెప్పాలనే ఇన్నాళ్లూ ప్రయత్నం చేశాను. ఇప్పుడు నిర్ణయం నీకే వదిలేస్తున్నాను — నన్ను క్షమించి — క్షమించి... నువ్వు ఊఁ — అంటే నా ట్రాన్స్ఫర్ కాన్సిల్ చేసుకోడానికి ప్రయత్నం చేస్తాను..."

నేనప్పటికి చైతన్యంలోకి వచ్చాను. ఆయన చెయ్యి విదిలించికొట్టి చివ్వున లేచాను. పరుగెత్తుతున్నట్లుగా నడిచి గార్డెన్ దాటాను.

ఎట్లా ఇంటికి చేరానో నాకే తెలీదు. నా జీవితంలోకి వెలుగు పోయి చీకటి వచ్చేసింది!

ఇంటికొచ్చాక — నిద్రపోతున్న పిల్లల్ని చూస్తే — నా కడుపు తరుక్కుపోయింది!

తలుపులన్నీ బిగించుకుని — పక్కమీద పడి తెల్లవార్లూ ఏడ్చాను —

కుమిలి — కుమిలి ఏడ్చాను.

కుళ్లి కుళ్లి ఏడ్చాను.

ఓదార్చేవాళ్లెవరు?

అయిపోయింది. నా జీవితం బుగ్గి అయిపోయింది.

నా సంతోషం అంతా మట్టిపాలయింది.

నా రాగమాలిక తునాతునకలైపోయింది.

బతుకంతా అంధకారమయమైపోయింది.

నందనవనం కాస్తా ఎడారి అయిపోయింది.

స్వర్గపుటంచులలోనించి నరకంలోకి తోయబడ్డాను.

నాకింక ఏడుపే మిగిలింది.

తెల్లవారంగానే నా గుడ్డలూ — పిల్లలవీ అన్నీ సర్దాను. అన్నయ్య దగ్గిరికి వెళ్లిపోయాను.

ఆయన నన్ను ఆపే ప్రయత్నం చెయ్యలేదు.

నేనింక ఆయనతో జీవితం గడపదలుచుకోలేదు. ఆడకైనా — మగకైనా శీలమన్నది ఎంతో ప్రధానమైనదని నా నమ్మకం. ఇంక నేనాయనతో కలిసివుండలేను.

ఎం. ఏ చదువుదామనుకున్నాను. ఎం. ఏ. అయ్యాక ఉద్యోగంలో చేరి — పిల్లల్ని మంచి స్కూల్లో చేర్పించి — వాళ్ల భవిష్యత్తుని తీర్చిదిద్దాలన్నదే నా ధ్యేయం — అనుకున్నాను.

అప్పుడే మా రిజల్ట్సు వచ్చాయి.

నేను బి. ఇడి. ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాను.

**జరిగిన కథ - 12:** నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది. సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు. కానీ అందులోనూ అసంతృప్తే. కొడుకు వస్తే కూతురో, కూతురువస్తే కొడుకో ఎవరో వొకరు తండ్రిదగ్గర కెళ్లిపోతారు. ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు. చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తుపడ్తాడు మంజులని. రామం భార్య రాధ. బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గరికి వస్తాడు రాజు. మధు అనారోగ్యం మంజులని మరింతగా కృంగదీస్తుంది. రామంతో పెళ్లి కాకముందు తనకోసారి పెళ్లయిందని రాధ నోట విని ఆశ్చర్యపోతుంది మంజుల. రాధ సంగతంతా తెలిసే పెళ్లి చేసుకున్నానుగానీ ఆమె కోసారి పెళ్ళయిందనే విషయం నన్నామెపట్ల రాక్షసుడిలా ప్రవర్తించేలా చేసేది ... అని మంజులతో చెప్తాడు రామం నీ కడుపులో బిడ్డకి తాను తండ్రి కాదన్న రామం మాటలకి మానసికంగా దెబ్బతిన్న రాధ మృత శిశువుని ప్రసవిస్తుంది. నువ్వూ, నాన్న కలిస్తే చాలా బావుంటుందమ్మా అంటూ ఉత్తరం రాస్తుంది సుధ మంజులకి. అమ్మా నాన్నకీ నీకూ మధ్య అసలేం జరిగింది? యెందుకు విడిపోయారు అని అడుగుతుంది సెలవులకి యింటికొచ్చిన సుధ. తనతో కలిసి బతకటానికి విముఖత చూపిన రాధని మంజుల దగ్గర దింపుతాడు రామం. మంజుల సహచర్యం రాధలో మార్పు తీసుకొస్తుంది. రాధకు ఆడపిల్ల పుడుతుంది. తన భర్త ప్రేమించి పెళ్లి చేసుకున్న ఆమె క్షయ వ్యాధితో మరణించిందని తెలిసి కలవరపడుతుంది మంజుల. భర్త వుద్యోగానికి రాజీనామా యిచ్చి ఎక్కడికో వెళ్లిపోయాడని తెలిసి బాధపడుతుంది మంజుల. మధు, సుధలని చూడటానికి బయల్దేరిన మంజులకి గతం గుర్తుకొస్తుంది.

నెల రోజులు గడిచాయి.

అన్నయ్యా వాళ్లింటికి ఆయన వచ్చారు.

నేను మాట్లాడనన్నాను.

అన్నయ్యే కోప్పడి పంపించాడు ఆయన దగ్గరికి.

నేను దృఢ నిశ్చయింతో వెళ్లాను — ఆయన ఎదుటికి.

''జరిగిందేదో — జరిగింది. ఆవిడ — నేను కలిసి వుండడమనేది కల్ల! ఆవిడని మర్చిపోయి మాతోనే వుండేట్లయితే నేను మీతో వస్తాను. లేదా — ఇంతటితో మీకూ — **నాకూ** సంబంధం తెగిపోయినట్లే లెక్క! కానీ — విడాకులకి మాత్రం నేను సమ్మతించను. భర్త అనేవాడు ఒకడుండాలి నాకు నా పిల్లలకి తండ్రి వుండాలి — నేను మాత్రం కోర్టుకి ఎక్కనులెండి!'' అన్నాను సాధ్యమయినంత కఠినంగా.

''మంజూ — ప్లీజ్ — అంత మాటనకు. నువ్వు లేకపోతే నేను బతకలేను. పిల్లలు నా ప్రాణాలు. మీ ముగ్గురూ నాకు కావాలి - మంజూ! నేను తప్పే చేశాను - నిజమే! దానికి నువ్వు ఏ దండన విధించినా భరిస్తాను. కానీ - ఆవిడ నన్నే నమ్ముకుని వాళ్ల దేశం వదిలి వచ్చింది. ఆవిడకి అన్యాయం చెయ్యడం ధర్మం అంటావా... ?''

''కాదు ధర్మం కాదు. అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్యను — కడుపున గన్న పిల్లలను — ఏట్లో దూకమనడం ధర్మం. లేదా — ఆవిడకి సేవకులుగా వుండమనడం ధర్మం — కదూ ?''

''మంజూ. నీకెట్లా చెప్పాలో నాకు తెలీడం లేదు. మీకేలోటూ రానివ్వను మంజూ! పిల్లలకి తండ్రి ప్రేమ పూర్తిగా యిస్తాను —''

''అవును. ఇస్తారు. ఎంతవరకు ? ఆవిడకి పిల్లలు కలిగేవరకేగా ? నాకు పతి ప్రేమ సగం ఇస్తారు - కదూ ? ఎంత ఉదారులు ! హూఁ! మీ దయాదాక్షిణ్యాల కోసం ఇక్కడెవరూ నాచిపోవడంలేదు. యాచించడంలేదు. తల్లి బతికుండగానే సవతితల్లి పోరు అనుభవించాల్సినంత ఖర్మ పట్టలేదు — నా పిల్లలకి !''

''అబ్బ! మాటలతో ఎట్లా చిత్రవధ చేస్తావు మంజూ !''

''నా మనసే పిల్లల బడి పోయిందండీ ! ఏమండీ — ఆడది — అందులో భారత స్త్రీ — తనదైన ఏ వస్తువునైనా పంచుకోగలదు... కానీ...కానీ... భర్తను మాత్రం — పంచుకోలేదండీ! అది మీకు అర్థం కాదు. ఇంక వాదనలనవసరం. మీరు ఒకసారి పొరపాటు చేశారు. అయినా పిల్లల కోసం సహిస్తాను. మీకు ఆవిడ కావాలో — నేను కావాలో మాత్రం తేల్చుకోండి ! ఇద్దరం కలిసి మాత్రం ఉండలేము. ఆవిడ కావాలంటే నన్ను — పిల్లల్ని మర్చిపోండి. లేదూ





మేము కావాలనుకుంటే ఆవిడతో వున్న సంబంధాలన్నీ శాశ్వతంగా తెంచుకోవాలి మీరు... అంతే...?'' లోపలికి వచ్చేశాను

ఎంతసేపటినించో బిగపట్టుకునివున్న ఏడుపు కట్టలు తెంచుకుంది.

వెక్కి — వెక్కి ఏడ్చాను.

పెళ్లికి — మాంగల్యానికి — ఏమాత్రపు విలువుంది ఈయన దృష్టిలో ? నన్నుంచుకునీ — ఆవిడని చేసుకున్నారు. ఆవిడనీ అట్లాగే చేసి మరొకరిని పెళ్లాడరని నమ్మకమేముంది ? ఎంత చంచల మనస్కులు ? సెక్స్ అంత ముఖ్యమా జీవితానికి ? అంత మాత్రం నిగ్రహం చూపలేకపోయారా ? ఛీ—ఛీ ! ఆవిడ ఎంత తెగించింది ? నాకు అసహ్యం — విరక్తి కలిగాయి సంసార సుఖమంటేనే !

ఛీ—ఛీ ! ఇంకొర్ని ముట్టుకున్న చేతులతో నన్ను లాలించారు. తల్చుకుంటేనే తేళ్లు—జర్రులు పాకుతున్నట్లుగా వుంది.

వివాహబంధం ఎంత పవిత్రమైంది ! దాన్ని ఎంత అపురూపంగా చూసుకోవాలి ? నేనింక ఆలోచించలేకపోయాను విషయాన్ని ! అంతే — నా వివాహ జీవితం ముగిసింది — అనుకున్నాను.

ఆ తరువాత రెండు — మూడుసార్లు ఆయన వచ్చారు. కానీ, నేను ఆయన కళ్లకూడా పడలేదు. ఇంక రావడం మానేశారు.

మూడేళ్లు గడిచాయి. అన్నయ్య దగ్గిరే వుండి ఎమ్. ఏ. పూర్తిచేశాను. ఆ తరవాత ఉద్యోగానికి అప్లై చేశాను.

ఈ లోపల వదినకి మళ్లీ ఆడపిల్ల పుట్టిపోయింది.

వదిన చాలా అధైర్య పడిపోయింది.

నేనే ధైర్యం చెప్పి, వదిన దగ్గిరే వున్నాను మరో ఆరు నెలలు.

ఆ తరువాత హైద్రాబాద్‌లోనే గవర్నమెంట్ కాలేజీలో లెక్చెరర్‌గా ఉద్యోగం వచ్చింది.

నేను, పిల్లలతో హైద్రాబాద్ వచ్చి వేరే యిల్లు తీసుకున్నాను.

పిల్లల్ని మంచి స్కూల్లో చేర్పించాలని వుంది నాకు.

అన్నయ్యే ఋషివాలీలో చేరుద్దామని సజెస్ట్ చేశాడు.

నాన్న ఆస్తిలో సహృదయులైన అన్నయ్య — వదినలు నాకూ వాటా యిచ్చారు.

ఆర్థిక యిబ్బంది లేకుండా పోయింది నాకు. ఆయన మొదట్లో నాకు డబ్బు పంపిస్తే — నేనది తిప్పి పంపించేశాను — రెండు మూడుసార్లు !

'ఆనిణ్ణి వదిలి నా దగ్గిరికి రాలేరు ! అటువంటప్పుడు ఆయన డబ్బు నాకెందుకు ?' అని ! తరవాత అదీ మానేశారు.

పిల్లల్ని ఋషివాలీ పబ్లిక్ స్కూల్లో - అన్నయ్యే వెళ్లి చేర్చి వచ్చాడు.

పిల్లల్ని వదిలి ఒంటరిగా వుండడం చాలా కష్టమే అయినా — విడిపోయిన తల్లీ — తండ్రీ

మధ్య పిల్లలు అంత ఆరోగ్యవంతంగా పెరగరు - అందుకనే ముఖ్యంగా అక్కడ చేర్చాను

సెలవలకి ఇంటికి వచ్చేవాళ్ళు

లేనప్పుడు ఇంట్లో నేను - వంటమనిషి వుండేవాళ్ళం

అన్నయ్య వారానికి ఒకటి—రెండు సార్లు వచ్చి వెళ్ళేవాడు

వాళ్ళని చేర్చిన ఆరునెలలకి - ఒకసారి అన్నయ్య నాతో అన్నాడు

"మంజూ— మొన్న బావ వచ్చి వెళ్ళాడే- పిల్లల్ని ఋషీవాలీలో చేర్చినందుకు చాలా సంతోషించాడు నీకభ్యంతరం లేకపోతే పిల్లల ఫీజ తను కడతానన్నాడు తరవాత —. సెలవుల్లో ఒకర్ని అక్కడికి పంపిస్తూండమని చెప్పాడు—"

"ఎందుకు ? ఇన్నాళ్ళూ ఏమయిందిట— ఈ అభిమానం ? సెలవుల్లో వెళ్ళి ఆవిడ చేత తిట్లు— శాపనార్థాలు తినాలి కాబోలు— పిల్లలు !"

"ఇదిగో -- మంజూ ! మీరిద్దరూ వేరయ్యారు సరే— పిల్లలకి తండ్రిప్రేమ ఎందుకు దూరం చెయ్యాలి ? నీ కిష్టం లేకపోతే నువ్వు వెళ్ళకు ఆవిడ కష్టపెట్టేట్టుగావుంటే అప్పుడే పంపించడం మానేద్దాం పిల్లలు కూడా ఊహ వస్తున్న వాళ్ళు— అట్లాంటి దేమన్నా వుంటే మనకి చెప్పక పోరు—"

అన్నయ్య వాదన సమంజసమే ననిపించింది నాకు

తండ్రిప్రేమ నేనెందుకు దూరం చెయ్యాలి— వాళ్ళకి ?

అప్పట్నుంచీ సెలవలకి ఒకళ్ళక్కడికి— ఒకళ్ళిక్కడికి వచ్చేవాళ్ళు

ఫీజులుకూడా ఆయనే కడుతున్నారు నాకిష్టం లేకపోయినా దానికీ ఊరుకున్నాను

పిల్లలకి తండ్రి దగ్గిరికి వెళ్ళడం—ఇష్టంగానే వుంది— అట్లాగే జరుగుతూ వుంది ఇప్పటిదాకా !

ఇంక ముందేం జరుగనున్నదో ?

ఆయనిప్పుడెక్కడున్నారో ?

అసలున్నారో . . లేరో. ?

భయంకంపితురాలనైనాను ఆ ఆలోచనకే !

జాగ్రదావస్థలోకి వచ్చాను

అట్లాగే జారగిలబడి నేను నిద్రపోయానో— లేక మెలుకువగానే వున్నానో నాకే తెలియలేదు నేను దిగవలసిన స్టేషన్ వచ్చింది

నా ఎదురుగ్గా వున్న జంట— ఎప్పుడు దిగిపోయిందో నేను గమనించనే లేదు !

## 23

పక్కన కూచున్న వాళ్ళ సహాయం చేయగా సామానుతో నేను కిందికి దిగాను

రైలు వెళ్ళి పోయింది

స్టేషన్నుంచి ఋషీవాలీకి ఫోన్ చేశాను నేను వచ్చాననీ— నాకు వెహికల్ కావాలనీను !

వాళ్ళు ఒక గంట తరవాత వాను పంపించారు దాంట్లో ఎక్కాను. వాను కదిలింది

ఋషీవాలీ చూడాలని ఎన్నేళ్ళనించో అనుకుంటున్నాను. ఇప్పుడు పడింది ఊరు దగ్గిర పడుతున్న కొద్దీ నాలో కుతూహలం మొదలయింది

పిల్లల్ని చూడబోతున్నానని సంతోషంగా వుంది వాళ్ళకి తినడానికి స్వీట్లు— జంతికలు, బిస్కెట్లు— చేగోడీలు— అన్నీ చేయించి తెచ్చాను

మలుపు తిరిగింది వాను అక్కడ "ఋషీవాలీ స్కూల్— ఫౌండేషన్ ఫర్ ది న్యూ ఎడ్యుకేషన్' అని రాసిన ఒక రాయి వుంది దాన్నే కాబోలు 'మేట్' అంటారు అడిగాను డ్రైవర్నిఅవునన్నాడు

అక్కణ్ణించి ఉత్సాహం తెచ్చుకుని చూడడం మొదలు పెట్టాను మట్టూ కొండలు - మధ్య తారురోడ్డు— ప్రశాంతంగా వుంది అంతా ఎక్కడ తప్ప జన సంచారమే లేదు సిటీల్లోలాగా రణగొణ ధ్వని అసలే లేదు వెళ్తున్న కొద్దీ ఆహ్లాద కరంగా వుంది. పంటపొలాలు పచ్చగా కనబడు తున్నాయి అంతా స్కూలుదేట ! బావిలోంచి పొలాలకి నీళ్ళు పట్టే ఏర్పాటు చేశారు స్ప్రింక్లర్లు పెట్టారు వాటిల్లోంచి నీళ్ళ వానజల్లులాగా పడుతున్నాయి

కాసేపటికి ఏవేవో బిల్డింగ్స్ కనబడ్డాయి ఊళ్ళోకి వచ్చేశాము కాబోలు — అనుకున్నాను

వాను గెస్ట్ హవుస్ ముందాగింది

మధు సుధ ఎప్పుడు తెలుసుకున్నారో—నేను వచ్చానని— పరిగెత్తుకొచ్చారు

ఇద్దర్నీ దగ్గిరికి తీసుకున్నాను

సామాన్లు గెస్ట్‌హవుస్‌బాయ్ లోపల పెట్టాడు నేనుముందేరాసి రూము రిజర్వు చేసుకున్నాను పిల్లలిద్దరూ నా చేతులు పట్టుకుని రూములోకి వచ్చారు

నిజంగా స్వర్గలోకంలోకి— నందనవనంలోకి అడుగు పెట్టినట్లుగా వుంది నా ప్రాణానికి !

"అమ్మా, కాఫీ తెమ్మంటారా ?" గెస్ట్‌హవుస్ అబ్బాయి అడిగాడు సరే నన్నాను

పిల్లల ఆనందం యింతా అంతా కాదు

"అమ్మా ! నువ్వు వచ్చేదాకా మాకు నమ్మకమేలేదు, నువ్వు వస్తావని "

అంది సుధ

"అవునమ్మా !" అన్నాడు మధు

ఏవేవో చెప్తున్నారు ఇద్దరూ, ఒకరాపితే ఒకరు !

వాళ్ళకోసం తెచ్చినవి అన్నీ యిచ్చాను - వాళ్ళ మాటలకు ఊకొడుతూ !

"అమ్మా ! ఒక్కమాట చెప్పనా ? నువ్వు ఎంత చిక్కిపోయావో తెల్సా ? ఎందుకమ్మా — రెండు నెలలకే యిట్లా అయిపోయావు ? వంట్లో బావుంటూ వుంటుందా ?" సుధ అనుమానంగా అడిగింది !

"నాకేమమ్మా పిచ్చితల్లీ ! నేను బాగానే వున్నాను !" అన్నాను

ఆయన కనబడకుండా వెళ్ళిపోయిన దగ్గిర్నించీ నన్ను అదే బాధ పీల్చి పిప్పిచేస్తోందనీ, తిండీ నిద్రా పూర్తిగా లేవనీ, యిక్కడి కొచ్చింది ముఖ్యంగా ఆ బాధ మర్చిపోవడానికేననీ యివన్నీ దాంతో ఎట్లా చెప్పను ? ఏమని చెప్పను ?

"నాన్న గురించి దిగులుకదూ ? చెప్పమ్మా !" రెట్టించింది సుధ

"నాన్న ఎక్కడున్నారో తెలీనేలేదా ? మామయ్యావాళ్ళు వెదకడంలేదా నాన్నకోసం ?"

ఇంకా ఏదో అనబోయింది సుధ

ఆ అబ్బాయి కాఫీ తీసుకొచ్చాడు

మధు అన్నాడు — "అక్కా - నువ్వు బ్రేక్‌ఫాస్టుకి వెళ్ళాలి కదా ?" అని

"అవునవును మర్చిపోయాను అమ్మా నువ్వు స్నానం అదీ చేసుకుని రెస్టు తీసుకుంటూ వుండు మేము క్లాసులయిపోంగానే వస్తాము —" అంటూ చెప్పులు తొడుక్కుంది

మధు — "అమ్మా నేనుకూడా వెళ్తాను బ్రెక్‌ఫాస్ట్ కెళ్ళాలి —" అంటూ వెళ్ళిపోయాడు

సుధ వెళ్తూ "అమ్మా టిఫిను తెప్పించుకుని తిను !" అని చెప్పి మరీ వెళ్ళింది

కాఫీ తాగి స్నానం చేసి వచ్చాను అలసటగా వుంటే కాసేపు పడుకున్నాను టిఫిన్ తెస్తానని ఆ అబ్బాయి అన్నాడు కానీ — నేనే వద్దన్నాను

మళ్ళీ నేను లేచేటప్పటికి — టైము పదకొండయింది గెస్ట్‌హవుస్ బయటికొచ్చాను వచ్చేటప్పుడు చూడలేదుగానీ - బయట తోట



ఇప్పుడిప్పుడే పైకొస్తోంది మెట్లమీద పూల కుండ్లు అమర్చారు చూడముచ్చటగా వుంది కారు పార్కింగ్‌కి కూడా చోటు చెట్లతోనే అమర్చారు తమాషాగా వుంది

చుట్టూ అడవి -- కొండలు -- మధ్యలో వుంది గెస్ట్‌హవుస్ సూర్యుడు పైపైకి వచ్చేశాడు

## రా గ మా లి క

కాసి చిత్రం — ఎండగా వున్నట్టేలేదు 'తపనుడు కరుణ చంద్రుడై తాండవించు—' అన్న మాట గుర్తుకొచ్చింది

అక్కడే బయట వున్న సిమెంటు బెంచీమీద కూచున్నాను గెస్ట్‌హవుస్‌లో ఆట్టే జనం లేరు. ఒకరిద్దరు పేరెంట్సు వున్నట్టున్నారు. హాయిగా వుంది అక్కడ కూర్చుంటే!

మనసునిండా గజిబిజిగా ఆలోచనలు

వంటరిగా వున్నానుగా—వంటరిగా వున్నప్పుడు నన్ను భయపెడతాయి ఆలోచనలు

ఆయనచుట్టూ తిరుగుతున్నాయి—నా ఆలోచలు. నాకింక సుఖపడే రోజులు లేవేమో ? లేకపోతే ఆయన నాకింకా దూరమవడమేమిటి ? ఇంతవరకు నామమాత్రంగా వున్న మనశ్శాంతి తుడిచిపెట్టుకు పోవడమేమిటి ?

నా ఆలోచనలో నేనుండి పిల్లలు ఎప్పుడు వచ్చిందీ గమనించనేలేదు.

సుధ తన స్నేహితురాళ్ళని వెంటబెట్టుకుని వచ్చింది. మధు మాత్రం ఒక్కడే వచ్చాడు.

సుధ ఫ్రెండ్సంతా 'ఆంటీ ఆంటీ—' అంటూ నా చుట్టూ చేరారు. నన్నెన్నో ప్రశ్నలు వేశారు. వాళ్ళు ఎన్నెన్నో చెప్పారు. వాళ్ల ఇళ్ల గురించి. వాళ్ల తల్లిదండ్రుల గురించి చెప్పారు. వాళ్లల్లో సంకోచం — భయం — మచ్చుకైనా లేవు. కొత్తవాళ్లతో గూడా ఎంతో ఫ్రీగా — స్వంత మనుషులతో మాట్లాడినట్లు మాట్లాడుతున్నారు. ఎంతో ముచ్చటేసింది నాకు. మామూలుగా మన ఇళ్లల్లో పెద్దవాళ్ల దగ్గిర సిగ్గుపడడం — మొహమాటంగా వుండడం—వుంటాయి. వీళ్ల కట్లాంటి వేమీలేవు.

''అమ్మా — డైనింగ్ హాల్‌కి వెళ్దాం — భోజనానికి. నువ్వు రెడీనే కదూ ?'' సుధ అడిగింది.

మధు తినేసే వచ్చాట్ట.

జూనియర్స్‌కి ముందే పెడతారు — భోజనం.

పిల్లలందరితో కలిసి డైనింగ్ హాల్‌కి బయల్దేరాను.

''అమ్మా ! అదిగో అదే ఓల్డు గెస్ట్‌హవుస్. కృష్ణజీ — అదే జిడ్డు కృష్ణమూర్తిగారు ఎప్పుడు వచ్చినా యిక్కడే వుంటారు. ఇదిగో — ఈ ముందుండే ఖాళీ స్థలం ? ఇక్కడికి మేమంతా వచ్చి ఆయన్ని రిసీవు చేసుకుని స్వాగతం చెప్తాం. అటుపక్క కొన్ని ఇళ్లున్నాయి...'' చెప్పింది సుధ.

నేను కుతూహలంగా వింటూ చూస్తూ నడుస్తున్నాను. ఒక మలుపు తిరిగాం.

''ఇదిగో ఈ చెట్టు చూశావా ? 'అస్తాచల్' అని బోర్డు వుంది. ఈ దారిని పోతే కొండ ఎక్కవచ్చునన్నమాట ! కొండ యెక్కి సూర్యాస్తమయం చూస్తాం, రోజూ మేము.''

''పైదాకా యెక్కుతారంటే రోజూను ?''

''అంత పైకి ఎక్కంలే. నువ్వూ చూద్దువుగాని ! కానీ యివాళ రేపు అస్తాచల్ లేదు. శని, ఆదివారాలు మాత్రం వుండదు. మిగతా అన్ని రోజులూ వుంటుంది. అయినా మనం వెళ్లచ్చులే.''

అంటూనే ఎడంచేతివైపు చూపిస్తూ — ''అవన్నీ హాస్టల్స్. అక్కడ మొగపిల్లలు వుంటారు. మన మధు వుండేది యిక్కడే. వాటిని హవుసు లంటారు. వాటి పేర్లేమిటో తెలుసా ? గోల్డెన్ హవుస్, సిల్వర్ హవుస్, నీమ్ హవుస్.'' సుధ ఆగింది.

''ఇదిగో యిది హాస్పిటల్. అదే డైనింగ్ హాల్. దీని ఎదురుగుండా ఖాళీ స్థలం వుందే ? అక్కడ మామ్మూన్‌లైటు డిన్నర్లు జరుగుతాయి.'' మధు అందుకున్నాడు.

''అమ్మా ! ఆ బిల్డింగే మా హాస్టలు. ఇక్కడంతా ఆడపిల్లలే వుంటారు. ఈమధ్యనే కట్టారివి ! అయ్యో ! టైమయింది. అదిగో, సైలెన్స్ బెల్ కూడా అవుతోంది. తొందరగా రా అమ్మా !''

పరిగెత్తారు పిల్లలంతా లోపలికి.

నేనూ నడిచాను డైనింగ్ హాల్ లోపలికి.

భోజనంచేసే ఆ పద్ధతి నాకెంతో నచ్చింది. టీచర్లంతా పగటి భోజనం తప్పనిసరిగా అక్కడే చెయ్యాలిట. పిల్లలు సరిగ్గా తింటున్నారో లేదో దగ్గిరుండి చూస్తున్నారు. ఎవరూ ఏదీ వేస్ట్ చెయ్యడానికి వీల్లేదు. కొందరు పిల్లలుకూడా పనివాళ్లతోబాటు సర్వింగ్ చేస్తున్నారు. అంతా ఒక క్రమపద్ధతిలో జరిగిపోతోంది. భోజనం కూడా చాలా బావుంది.

అక్కడే వాళ్ల టీచర్లని కొంతమందిని పరిచయం చేసింది సుధ. అందరూ ఎంతో మర్యాదపూర్వకంగా మాట్లాడారు.

వాళ్ల 'హవుస్ మదర్ని' కూడా పరిచయం చేసింది సుధ. వాళ్లంతా సుధని ఎంతో మెచ్చుకుంటూ మాట్లాడారు. చాలా చురుకైన పిల్ల అనీ బాగా చదువుతుందనీ హవుస్‌లో కూడా అల్లరి చెయ్యదనీ, ముఖ్యంగా హవుస్ మదర్‌కి చాలా సహాయంగా వుంటుందనీ చెప్పారు, అందరూకూడా!

> **త్వరలో**
> **ఇలా ఎందుకు జరిగింది?**
> **ప్రారంభం!**

భోజనానంతరం వాళ్ల హాస్టల్‌కి వెళ్లాం. వాళ్ల హవుస్ మదర్ హాస్టలంతా చూపించింది. ఎంతో ఆర్టిస్టిక్‌గా వుంది హాస్టల్ అలంకరణ. ఒక రూము హాలులాగా వుంది — అది కామన్ రూముట ! సోఫాలు. కర్టెన్లూ ఎంతో బావున్నాయి. గోడలు మంచి మంచి బొమ్మలతో అలంకరించారు. అవీ ఎక్కువగా లేవు. ఒక మూల ఫ్లవర్‌వాజూ — అందులో తాజా పూలూ ఉన్నాయి.

హవుస్ మీటింగ్స్ — ఏవైనా హవుస్ ప్రోగ్రామ్స్ అక్కడ జరుగుతాయిట. రేడియో కూడా వుంది అక్కడ !

బెడ్‌రూమ్‌లో బెడ్స్ అన్నీ సిమెంటుతో చేసినవి. వాటిమీద పరుపులు. దుప్పట్లు ఎంతో నీట్‌గా అరేంజ్ చేసి వున్నాయి. తలుపులు మస్కిటోనెట్‌తో క్లోజ్ చేసివున్నాయి. అక్కడ డ్రస్సింగ్ టేబిల్స్ — అద్దాలు అన్నీ వున్నాయి. ఒక్కొక్క అమ్మాయికి ఒక్కొక్క షల్ఫు ఇచ్చారు. పైనవాళ్ల ట్రంక్స్ అన్నీ పెట్టుకోడానికి అటక లాంటిది వుంది. అదీ ఎంతో నీట్‌గా అమర్చుకున్నారు.

హవుస్ మదర్‌కి వేరేగా - హాస్టల్‌లోనె — రెండు రూములూ—అటాచ్‌డ్ బాత్‌తో వున్నాయి. అంటే ఆవిడా వీళ్లతోనే వుంటుందన్న మాట ! వాళ్ల బాధ్యతంతా ఆవిడదే !

పైనకూడా ఆ విధంగానే వుంది. కొంచె తేడాతో ! పైన వేరే హవుస్ మదర్ — కింద వేరే ! మొత్తం హాస్టల్‌కి ఒక యాభై — యాభై మంది వున్నారు.

వీళ్లంతా సీనియర్ గరల్స్ !

హాస్టల్ లోపల — బయట కూడా మంచి గార్డెన్ గ్రో చేస్తున్నారు. కిందనించి పైకి అల్లించి అందమైన పూలతీగెలు పొదల్లాగా అల్లుకుని వున్నాయి. వాటి నిండుగా ఎరుపురంగు పూలు విరగబూసి వున్నాయి ! పైన కొద్దిగా బాల్కనీ వుంది. అక్కడ కొన్ని పూలకుండీలు, వాటిల్లో గులాబీలు వున్నాయి. తోట పని చేసేది పిల్లలే. అట్లాగే హవుస్ క్లీనింగ్ డ్యూటీ కూడా పిల్లలదే !

సుధ కిందే వుంటోంది

హవుస్ మదర్ల స్నేహ సౌహార్ద్రాలు మరువలేనివి ! పిల్లలకి నిజంగా వాళ్లు కన్నతల్లులే ! అంతకన్న ఎక్కువేమో !

ఆరోజు సాయంత్రందాకా ఆ హాస్టలులోనే గడిపాను. మధు కాసేపుండి వెళ్లిపోయాడు. మళ్లీ సాయంత్రం వస్తానన్నాడు. సాయంత్రం ఏదో ఫిల్మ్ షో వుందిట !

పిల్లలకి శనివారం ఏదో ఒక ఎంటర్‌టెయిన్‌మెంట్ ప్రోగ్రామ్ వుండితీరాలి !

నాలుగ్గంటల ప్రాంతంలో నేను గెస్టుహవుస్‌కి వచ్చేశాను. రెడీ అవుదామని.

నేను రెడీ అయ్యేటప్పటికే మధు, సుధ కూడా రెడీ అయి వచ్చారు.

వాళ్ల హాస్టలు చూడాలని మధు గోలచేశాడు. సరే, వెళ్లాం. రోడ్డుకి కొంచెం కిందుగా వున్నాయి వీళ్ల హాస్టల్స్. కిందికి వెళ్లడానికి మెట్లున్నాయి. రెండు పెద్ద పెద్ద వేపచెట్లు వున్నాయి వీళ్ల హాస్టల్స్‌కి బయట. అందుకేనేమో వీళ్ల హాస్టల్స్‌కి 'నీమ్ హవుస్'లని పేరు పెట్టారేమో ! చెట్లచుట్టూ సిమెంటుతో అరుగులాగా కట్టారు. పిల్లలు కూచోడానికి వీలుగానన్నమాట. అక్కడ చాలామంది మధు ఈడు పిల్లలు ఆడుకుంటున్నారు. చిన్నగా, క్లీన్‌గా వున్నాయి హాస్టల్సన్నీ, హవుస్ మాస్టర్లు ఒకళ్లిద్దరు ఫామిలీతో కూడా వుంటున్నారు. ఎంతో ఆప్యాయంగా మాట్లాడారు వాళ్లు. సీనియర్ బాయిస్‌కి వేరే హాస్టల్ వుంది ! వానికి వేరే హవుస్ మాస్టర్లుట ! మధు హవుస్ మాస్టర్‌తో కాసేపు మాట్లాడి వాక్‌కి బయల్దేరాం. స్కూలు బిల్డింగ్ లోపలా - బయటా కూడా చూశాం. స్కూలు ఆవరణ అంతా తోట చాలా బాగా పెంచారు. పేరు తెలీని పూలు ఎన్నో వున్నాయి అక్కడ !

లైబ్రరీ స్కూలు బిల్డింగ్‌లోనే వుంది. 'లాబ్' మాత్రం విడిగా వుంది.

రంగు రంగుల బట్టలేసుకున్న పిల్లలు కనుల విందు గొలుపుతున్నారు. వీళ్లకి యూనిఫారమ్ లేదుట ! వాళ్లిష్టమైన బట్టలు వేసుకోవచ్చుట ! ఎందుకంటే ఇల్లైనా—స్కూలైనా ఇదేగావాళ్లకి?

మామూలు రోజుల్లో వీళ్లకి చాలా టైట్ ప్రోగ్రామ్ వుంటుంది. అసలు తీరికే వుండదు. పొద్దున్నే పి. టి. తరవాత టిఫిను — తరవాత అసెంబ్లీ — స్కూలు — ఆ తరవాత భోజనం - రెస్టు — మళ్లీ మధ్యాన్నం స్కూలు, టీ, గేమ్స్, స్నానాలు, అస్తాచల్, భోజనం, నిద్ర. ఇదీ క్లుప్తంగా వీళ్ల కార్యక్రమం. [ఇంకా వుంది]



'మంచికి స్థానం లేదు'లో ఒక సన్నివేశం

# జి. వి. జి. పేజీ

### మళ్ళీ తెరమీద ఎం. జి. ఆర్.

"నేనింకో రెండు నెలల్లో మళ్ళీ సినిమాలలో నటించబోతున్నాను. లోగడ డాక్టర్ బి. సి. రాయ్ పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి అయిన తర్వాత కూడా రోగులకు వైద్యసేవ కొనసాగించలేదా? అంచేత, నేను కూడా ముఖ్యమంత్రి పదవిలో ఉంటూనే మరోవంక సినిమాలలో నటిస్తే తప్పేముంది?" అన్నారు ఎం. జి. ఆర్. ఇటీవల ఒక బహిరంగసభలో.

### శ్రీ గుమ్మడి పూర్ణారోగ్యం

అస్వస్థతనుంచి పూర్తిగా కోలుకున్న గుమ్మడి గారిని 'ఫిల్మోత్సవ్'లో ప్రదర్శింపబడిన "టాక్సీ డ్రయివర్" చిత్రానికి వచ్చినప్పుడు చూశాను. "ఆ చిత్రం గురించి కొందరు ఎంతో గొప్పగ చెప్పగా వచ్చాను. కాని, చాలా నిరుత్సాహం కలిగించింది" అన్నారు. ఆ తర్వాత ఫిబ్రవరిలో వారి గృహంలో మళ్ళీ కలిశాను. "ఖులాసా?" అని ప్రశ్నించారు మందహాసంతో. "అదేమిటండీ! మిమ్మల్ని నేనడగాల్సిన ప్రశ్నను మీరే నన్ను అడుగుతున్నారే!" అన్నాను. "ఏం లేదు. జస్ట్ ఎమైల్డ్ హార్ట్ అటాక్. ఇప్పుడు ఫరవాలేదు. అయినా, కొంత కాలం విశ్రాంతి అవసరమన్నారు డాక్టర్లు. త్వరలో విడుదలయ్యే 'దేవదాసు మళ్ళీ పుట్టాడు, డూ డూ బసవన్న, విచిత్ర జీవితం' చిత్రాల్లో నా డబ్బింగ్ పని కాస్త ఉంది. 'చల్ మోహన రంగ' చిత్రంలో ఒక కాల్‌షీట్ పనుంది. ఇవి పూర్తిచేశాక నేను ఒప్పుకున్న కొత్త చిత్రాలు మే, జూన్‌లలో ప్రారంభం కానున్నాయి. ఆ తర్వాత స్టేట్స్‌కు వెళ్తున్నాను జెనరల్ హెల్త్ చెక్ అప్‌కు. అక్కడ మా అమ్మాయి, నా సోదరుడు ఉన్నారు. ఈ జబ్బు ధర్మమా అని సిగరెట్లు పూర్తిగా మానేశానండోయ్. అదివరకు రోజుకు 50-60 సిగరెట్లు తాగేవాడ్ని. మానేశాక ఇప్పుడెంత హాయిగా ఉందో తెలుసా?" అన్నారు ఎంతో ఉత్సాహంతో. ఇప్పుడు వారి వయసు 51. "ఇటువంటి బరువైన సన్నివేశాలలో నటించేటప్పుడు తగు జాగ్రత్తల్లో ఉండడం మంచిదనుకుంటూ..." అన్నాను. "అసలు నా కేరెక్టర్స్ అన్నీ వచ్చేవి హెవీ సీన్‌లలోనే. సెట్‌కు వెళ్ళి ఒకసారి పాత్రలో లీనమయ్యాక అంతే. అది బరువైన సన్నివేశమో — కాదో అనే ధ్యాసే ఉండదు. దృష్టంతా పాత్రమీదే ఉంటుంది కదా? రాజీ అనేది ఎక్కడా ఉండదు" అన్నారు. వారి ఎదురుగా టేబుల్‌మీద పడున్న అసంఖ్యాక ఉత్తరాలను చూసి, "మీ అభిమానుల దగ్గర్నించి వచ్చిన ఉత్తరాలనుకుంటాను?" అని అడిగాను. "అవునండి. నా ఆరోగ్యం గురించి ఎంతో ఆదుర్దాతో తెలుసుకోగోరిన ఈ సహృదయులందరికీ ఎలా ప్రత్యుత్తరాలివ్వడమా అని ఆలోచిస్తున్నా. ఇంతలో మీరొచ్చారు," అన్నారు.

### 'టాడ్-ఓ'లో తొలి చిత్రం

మైక్ టాడ్ అనే బ్రాడ్వే మ్యూజికల్స్ నిర్మాత కనుగొన్న 'టాడ్-ఓ' ప్రాసెస్ తొలిసారిగా 1955లో హాలీవుడ్‌లో ప్రవేశపెట్టబడింది. 'సినీరమ' విధానంలో చిత్రీకరించేందుకు 3 కెమెరాలు, ప్రదర్శించేందుకు 3 ప్రొజెక్టర్లు అవసరం. ఇందుకు భిన్నంగా ఒకే కెమెరాతో, ఒకే ప్రొజెక్టర్‌తో వీక్షకులు తెరమీద చూపబడే సన్నివేశానికి అతి సామీప్యంగా ఉన్నాననే అనుభూతిని 'సినీరమ' ఎఫెక్ట్‌కుమల్లే కలిగించే 'టాడ్-ఓ'లో తయారయ్యే తొలి తెలుగు చిత్రం ఎన్. టి. ఆర్. తో కె. బాపయ్య దర్శకత్వంలో కె. విద్యాసాగర్, ఎం. కామ్., నిర్మించే తిరుపతి పిక్చర్స్ వర్ణచిత్రం "సాహసవంతుడు". మే 10న ఖాట్మండూలో షూటింగ్ ప్రారంభం. ఈ వినోదాత్మక సాంఘిక చిత్రానికి కథ, మాటలు భమిడిపాటి రాధాకృష్ణ, గీతాలు ఆత్రేయ రాశారు. మహదేవన్ సంగీతం, నరసింహారావు కూర్పు, భాస్కరరాజు శిల్పం, ఎస్. సాంబశివరావు నిర్మాణ నిర్వహణ, బీరం మస్తాన్‌రావు సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తారు.

### పెంకుటిల్లు కథ

"సామాన్య కుటుంబంలో జరిగేకథ. అందుకే ఏలూరు దగ్గరున్న మా స్వగ్రామం చాటపర్రులోనే ఒకే షెడ్యూల్‌లో చిత్రమంతా పూర్తిచేశాం," అన్నారు శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "బొమ్మరిల్లు" చిత్రానికి నిర్మాణ పర్యవేక్షణ వహించే విజయాబాపినీడు. "నా స్వగ్రామమే కాదు. మా చిత్రం హీరో మురళీమోహన్, డైరెక్టర్ శ్రీ జి. రామినీడు, నిర్మాతలు పర్వతనేని గంగాధరరావు, చటర్జీ, ముఖర్జీగార్లందరిదీ కూడా మా ఊరే. మా చిత్రం నిర్మాణంలో ఉండగా రెండు విశేషాలు జరిగాయి. జయంతి, మా చిత్రంలో హాస్యనటుడు రాజన్‌బాబుల పుట్టిన రోజు ఉత్సవాలు జరగడం... ఇకపోతే, దుర్ఘటన- హీరో మురళీమోహన్ తమ్ముడికి జరిగిన ప్రమాదం. ఇంకా కె. విజయ, రమాప్రభ, మాధవి, శ్రీధర్, ప్రభాకరరెడ్డి, ఈశ్వరరావు, మోహన్‌బాబు, రావు గోపాలరావు, రావి కొండల రావు, నరసింహరాజు ప్రభృత నటీనటులందరూ ఏకబిగిన సాగిన షూటింగ్ షెడ్యూల్స్‌లో నిర్విరామంగా పాల్గొన్నందున అనుకున్న వ్యవధిలోనే చిత్రాన్ని పూర్తి చేయగలిగాం," అనికూడా అన్నారు విజయాబాపినీడు. రాజాచంద్ర తొలిసారిగా దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మాత.

### మల్లెపూవు

ఈమధ్య నేను చూసిన చక్కని చిత్రాలలో సి. మధుసూదనరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి. ఆర్. యాచేంద్ర, కె. చటర్జీ నిర్మించిన సమతా ఆర్ట్స్‌వారి వర్ణ చిత్రం "మల్లెపూవు" ఒకటి. శోభన్‌బాబు, లక్ష్మి, జయసుధ, కె. విజయ, శ్రీధర్, రావు గోపాలరావు, కె. వి. చలం, మాడా మున్నగువారి నటన, ఆత్రేయ - వేటూరి రచన, చక్రవర్తి సంగీతం, ఎస్. వెంకటరత్నం ఛాయ, ఎస్. కృష్ణారావు శిల్పం, వి. అంకిరెడ్డి కూర్పు వారి వారి ప్రతిభలకు నిదర్శనాలు. ఈ చిత్రంలో ఆరుద్ర, వేటూరి సుందరరామమూర్తి కూడా ఒక ముఖ్యమైన సన్నివేశంలో పాల్గొనడం మరో విశేషం.

### ఉగాది విడుదల

"ఉగాదికి విడుదల చేయాలనుకుంటున్నాం" అన్నారు అపర్ణా మూవీస్ పతాకంలో "కలియుగ సీత" చిత్రాన్ని పి. సాంబశివరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మిస్తున్న సుప్రసిద్ధ ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి. చంద్రమోహన్, సత్యనారాయణ, జయసుధ, సాక్షి రంగారావు, పొట్టి ప్రసాద్, పుష్పకుమారి వగైరా తారాగణం. సత్యానంద్ మాటలు, సత్యం సంగీతం, డి. వెంకటరత్నం కూర్పు, తోట శిల్పం, కె. వి. ఎస్. కుటుంబరావు సహ దర్శకత్వం నిర్వహించారు.

[31వ పేజీ చూడండి]

# బ్రిటానియా
# పాల బిస్కట్

## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




**రుచికరమైన, పుష్టికరమైన**
**బ్రిటానియా గ్లాక్సో మిల్క్ బికీస్**

లింటాస్ - BBC.GLXMB.1-203 TL



'అమర ప్రేమ'లో కమలహాసన్, జరీనావహాబ్

# "వితరణశీలి" శ్రీ ఎన్టీఆర్ !

"మన దేశం" చిత్రం ద్వారా వెండితెరకు పరిచయమైన శ్రీ ఎన్టీఆర్, మన దేశం కన్న అపూర్వ జాతకులలో ఒకరు. "మన దేశం" కోసం ఎన్నో ప్రజాహిత కార్యక్రమాలను నిర్వహించిన శ్రీ ఎన్టీఆర్‌ను మన దేశమే గాక, యితర దేశాలు కూడా మెచ్చుకుంటున్నాయి. ఎందుకంటే... ఆయన నిర్వహిస్తున్న బహుపాత్రలను ప్రపంచంలో మరెవ్వరు చెయ్యలేరు గనక.

"పాతాళభైరవి" చిత్రం విజయం సాధించినప్పుడు ఎంత నమ్రత... ఎంత విధేయత వుండేవో... "అడవిరాముడు...కర్ణ...యమగోల" చిత్రాల విజయం తరువాత కూడా అంతే.

**తెలుగు పరిశ్రమకు మూలవిరాట్టు**

శ్రీ ఎన్టీఆర్‌ను "తెలుగు పరిశ్రమ మూలవిరాట్టు" అని నిస్సంకోచంగా నిర్వచించవచ్చు. ఎందుకో తెలుసా ? ఆయనతో చిత్రాన్ని నిర్మించే వ్యక్తికి ... గ్యారంటీ లాభం విడుదలకు ముందే లభిస్తున్నది. ఆయన నటించిన పాత చిత్రాలకు వస్తున్న వసూళ్లు, కొందరి కొత్త చిత్రాలకు రావడంలేదంటే ... యిసుమంత అతిశయోక్తి లేదు. కొన్ని కోట్ల రాబడికి కారకుడుగా వుంటున్న శ్రీ ఎన్టీఆర్‌ను "తెలుగు పరిశ్రమకు సారధి" అంటే ... యెవ్వరికీ ఇబ్బంది కలిగించదనుకుంటా.

శ్రీ ఎన్టీఆర్‌కు ప్రజలలో వున్న బలం అనితరసాధ్యమైనది. ఆయిన చిత్రాలకు వచ్చే వసూళ్లు ... మరెవ్వరికీ రావు అన్నా నిజమే అవుతుంది.

ఈ ఏట (54 వ ఏట) కూడా ఆయన రోజుకు యిరవైగంటలు శ్రమిస్తున్నారంటే, మానసిక ఆనందం కారణం కాదా ! లక్షలాది ప్రజలు కురిపిస్తున్న అభిమానవర్షం ఆయనలో నూతన ఉత్సాహాన్ని, కొత్త రక్తాన్ని సప్లయి చేయక మానుతుందా ?

రెండు సంవత్సరాల క్రితం శ్రీ ఎన్టీఆర్‌కు వున్న ఫాలోయింగ్ వేరు ... ఈరోజున ఆయనకు ఏర్పడిన యిమేజ్ వేరు ... విద్యార్థులు .. మహిళామూర్తులు కూడా మాస్‌తోబాటు శ్రీ రామారావు చిత్రాలపట్ల ఆనంద ఉత్సాహాలను ప్రదర్శించడం ... యిటీవల ఆయన ఆర్జించిన అనూహ్య విజయం.

**సమయస్ఫూర్తి వున్న మూర్తి**

ఈమధ్య బ్రదర్ శ్రీ అక్కినేనితో, ఆయన జరిపిన తుఫాన్ నిధి కార్యక్రమాన్ని ఇప్పుడిప్పుడే తలెత్తుతున్న ఒక కథాకారుడు విమర్శించడం పాఠకులకు తెలియనిదికాదు. సంస్కారవంతుడు గనక, కార్యశూరుడు గనక ఆ విమర్శను ఆయన

'పంతులమ్మ'లో రంగానాథ్, లక్ష్మి



'అన్నదమ్ముల సవాల్'లో కృష్ణ

పట్టించుకోలేదు. అట్టి విమర్శకు విలువిస్తే... అనవసరంగా ఎదటి వ్యక్తికి బలం చేకూర్చినట్టు అవుతుందని తెలిసే, ఆ మహానటులు సైలెంట్‌గా వుండగలిగారు.

ఆ పర్యటనప్పుడు ప్రజావాహిని యిచ్చిన స్వాగత సత్కారాలను, యితోధికంగా యిచ్చిన కానుకలను రామకృష్ణ మిషన్ ద్వారా అందచేసిన ఆయన సమయస్ఫూర్తిని ప్రజలు మరువగలరా ?

### వద్దు అన్నవి

శ్రీ ఎన్టీఆర్‌కు అత్యాశగాని, దురాశగాని వుండివుంటే, తను కావాలి అని వచ్చిన ... రెండు సంవత్సరాల వరకు వెయిట్ చెయ్యగలము అని కోరిన ఎందరికో "నో...సారీ" అనగలరా ? అదే శ్రీ ఎన్టీఆర్‌లోని మంచితనం.

ఈ సంవత్సరంలో శ్రీ ఎన్టీఆర్ అంగీకరించిన కొన్ని చిత్రాలను పరిశీలిస్తే ... ఆయన డబ్బుకన్నా మంచితనానికి, స్నేహానికి ప్రాధాన్యత యిచ్చినట్టు తెలుస్తోంది

శ్రీ సి. ఎస్. రాజు, నవశక్తి గంగాధరరావు గారు, శ్రీ తోట సుబ్బారావు నిర్మిస్తున్న చిత్రాలకు శ్రీ ఎన్టీఆర్ పని చెయ్యడం, ఎన్టీఆర్ వితరణశీలానికి ప్రత్యక్ష నిదర్శనం కాదా !





### ఎన్టీఆర్ ప్రత్యేకత

వ్యాపారరీత్యా శ్రీ ఎన్టీఆర్ చిత్రానికి ఒక ప్రత్యేకత వుంది. అదేమిటన — ఆయన నటిస్తున్నారు అని పత్రికలలో ప్రకటన చూస్తేచాలు... నేను ... నేను...అంటూ అడ్వాన్సు యివ్వడానికి పంపిణీదారులు...కొనుగోలుదారులు పందెం వేసుకుంటూ వస్తారు. ఈ ఎడ్వాంటేజ్ తమిళంలో ఒక్క ఎం.జి.ఆర్. గారికి తప్ప మరెవ్వరికీ లేదు.

### చరితార్థ కథానాయకుడు

శ్రీ ఎన్టీఆర్‌ను చరితార్థ కథానాయకుడు అని పేర్కొనాలి. ఎందుకని పాఠకులు అడగొచ్చు. ఒక నటుడు రాముడుగా, రావణుడుగా, భీష్ముడుగా, భీముడుగా, కర్ణుడుగా, కృష్ణుడుగా, సుయోధనుడుగా, ఈశ్వరుడుగా రాణించడం శ్రీ ఎన్టీఆర్‌కు మాత్రమే సాధ్యమయ్యింది

### చలనచిత్రాలలో కొత్త మలుపు

తెలుగు చిత్ర రంగం ఏమిటి? కోటి రూపాయల వ్యాపారాన్ని ఆర్జించడమేమిటి అని అనుకునేవాళ్లకు... శ్రీ ఎన్టీఆర్ నటించిన రెండు చిత్రాలు "అడవిరాముడు...యమగోల" కొత్త మలుపును దారితీశాయి. ఆ చిత్ర విజయాలు కొత్త నిర్మాతలకు మరింత వుత్సాహాన్నికలిగించి... విదేశాలలో నిర్మించే ధైర్యాన్ని యిచ్చాయి.

### సొంత చిత్రంలో అయిదు పాత్రలు

శ్రీ ఎన్టీఆర్. మరో మహత్తరమైన పనిని చెయ్యడానికి నిర్ణయించారు. అదేమిటో తెలుసా? "విరాటపర్వం" చిత్రంలో అయిదు పాత్రలను పోషించడం. ఎన్టీఆర్‌గారి విజయ పరంపరలకు కారణం ఏమిటి అని ఆయన్ను ప్రశ్నిస్తే...ప్రజల ఆశీర్వాదబలం...దైవానుగ్రహం అంటారు.

'ఎత్తుకి పైఎత్తు'లో సంగీత





'అక్బర్ సలీమ్ అనార్కలి'లో ఎన్. టి. ఆర్., బాలకృష్ణ

# సినిమా

**దేవదాసు అంటే ... అక్కినేనిగారే**

శరత్ దేవదాసు పాత్రను అద్వితీయంగా పోషించిన శ్రీ నాగేశ్వరరావు దాసరిగారి కొత్తతరహా దేవదాసును అంతే సామర్థ్యంతో పోషించిన వైనాన్ని యీ విలేఖరి చూశాడు. [ దేవి ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్రంలో. ]

అగ్రదర్శకుడు శ్రీ దాసరి ఎంతటి ప్రజ్ఞాధురీణుడో "దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్రం ఒక్కటి చాలు. శరత్ దేవదాసు పాత్రకు భంగం వాటిల్లకుండా, తన దేవదాసును యెంతో జాగ్రత్తగా, యెంత విశిష్టంగా శ్రీ దాసరి సృష్టించారా అనిపించింది.

ప్రేక్షకులు "థ్రిల్" ఫీలయ్యే ఎన్నెన్నో సన్నివేశ ఘట్టాలను, శ్రీ దాసరి అనూహ్యంగా సృష్టించడం ... ఒక్కమాటలో చెప్పాలంటే ... అనితరసాధ్యం.

ఇరవై ఏడవయేట నటించిన దేవదాసు పాత్రను, యాభై మూడవయేట కూడా అద్భుతంగా నటించి గలిగిన శ్రీ అక్కినేనికి "మళ్లీ పుట్టాడు" కీర్తి కిరీటంగా చరిత్ర పుటల్లో చోటు చేసుకుంటుంది.

దర్శకుడు శ్రీ దాసరి ఊహాశక్తిని ఎంతయినా మెచ్చుకోవాలి. ఎందుకో తెలుసా ? ఆనాటి మేటి సావిత్రిగారిని, నేటి మేటి వాణిశ్రీ గారిని "దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్రంలో యెంతో నైపుణ్యంగా జొప్పించినందుకు.

సంగీత సాహిత్యాలు, సంభాషణ గీతికలు, మధుర స్వరాలాపనలు దేవదాసు స్థాయికి తగ్గకుండా శ్రీ దాసరి చేసిన కృషికి ప్రజలు పట్టాభిషేకం చేస్తారు.

"దేవదాసు మళ్లీ పుట్టాడు" చిత్రాన్ని ప్రారంభించినప్పుడు ఎంత ధైర్యంగా విమర్శలను తట్టుకున్నారో, ఈరోజు వస్తున్న అభినందనల పరంపరలకు నిర్మాతద్వయం శ్రీనివాసులు ... పాండురంగప్పగార్లు ఉబ్బితబ్బిబ్బు అవ్వకపోవడమే, వారి ప్రత్యేక లక్షణం.

వారు ఆనందపడుతున్నందుకు ఒకే ఒక కారణాన్ని శ్రీనివాసులుగారు చెపుతున్నారు. "శ్రీ దాసరి ... శ్రీ అక్కినేని కాంబినేషన్ను యెప్పటికీ విడవరాదు అనేది నిర్ణయాన్ని తీసుకోవడానికి, ఆ ప్రతిభావంతులు యిచ్చిన ఆనంద ... ఉత్సాహ ప్రతిభావుత్సత్తే నా ఆనందానికి కారణం", అన్నారు.

మార్చి యిరవై మూడుకోసం లక్షలాది ప్రేక్షకులు నిరీక్షణతో వున్నారు. శ్రీ అక్కినేని, శ్రీ దాసరి చలనచిత్ర జీవితంలో "దేవదాసు మళ్లీ పుట్టాడు" చిరస్థాయిగా నిలిచిపోతుంది.

**అగ్రనటుడు అగ్రనటి**
**పాల్గొనే శ్రీరామరక్ష**

అగ్రనటుడు శ్రీ అక్కినేని, అగ్రనటి వాణిశ్రీ సమాన సాన్నిధ్యం గల ఉత్తమశ్రేణి పాత్రలను పోషించనున్న కొత్తతరహా సాంఘిక చిత్రాన్ని, అజయ్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మాత "జైహింద్" శ్రీ సత్యం మార్చి 19న ప్రారంభిస్తున్నారు.

వరుసగా మూడు హిట్ చిత్రాలకు కారకుడయిన శ్రీ తాతినేని రామారావు "శ్రీరామరక్ష" వర్ణ చిత్రానికి నిర్దేశకుడుగా, చలపతిరావు సంగీత దర్శకుడుగా, బాలమురుగన్ కథకుడుగా, ఆచార్య ఆత్రేయ సంభాషణ రచయితగా, సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడుగా పదవీభారాన్ని నిర్వహిస్తున్నారు.

**అక్కినేని ... జయసుధ**

అజయ్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న "శ్రీరామరక్ష" వర్ణ చిత్రంలో అక్కినేనిగారిది వైవిధ్యం వున్న ద్విపాత్రాభినయం గనుక, ప్రధాన పాత్రధారిణిగా అగ్రనటి ఎంపిక అయ్యింది గనుక, మరో ముఖ్య పాత్రధారిణిగా జయసుధను దర్శకుడు శ్రీ రామారావు ఎంపిక చేయడం సమంజస నిర్ణయము అనిపిస్తుంది.

ఈ చిత్రంలో సత్యనారాయణ, రావుగోపాలరావు, గుమ్మడి, అల్లురామలింగయ్య, నాగభూషణం, గిరిబాబు వంటి పాపులర్ నటులు సహాయ పాత్రలను పోషిస్తున్నారు.

మార్చిలో జరిగిన ఆరు పాటలను, కొనడానికి వచ్చినవాళ్ళు విని "భేష్ భేష్" అన్నారు. ఈ చిత్రానికి నవయుగ (ఆంధ్రా) పంపిణీదారులు.

**భారీ తారాగణంతో దేశంకోసం**

ఈ సంవత్సరం రానున్న చిత్రాలన్నీ భారీగా, స్కోప్ వర్ణ చిత్రాలుగా వుంటున్నాయి గనుక, సురేష్ సంస్థ నుంచి మరింత పెద్ద చిత్రాన్ని ప్రేక్షకులు ఆశిస్తారు. అందుకని, భారీ తారాగణంతో, అంటే నలుగురు అగ్రశ్రేణి నాయకులతో, నాయికలతో తన చిత్రం రూపొందగలదని, శ్రీ రామానాయుడు తెలిపారు.

"దేశంకోసం" పేరిట స్కోప్ వర్ణ చిత్రంగా యీ సంవత్సరం నిర్మాణమయ్యే సురేష్ ప్రొడక్షన్స్ అవసరమనుకుంటే... విదేశాలలో చిత్రీకరణకు వెనకాడదు అని శ్రీ రామానాయుడు వ్యక్తం చేశారు.

'బొమ్మరిల్లు'లో కె. విజయ, ఈశ్వరరావు






దేవీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్

# దేవదాసు మళ్ళీ పుట్టాడు

-ఈస్ట్‌మన్ కలర్

నిర్మాతలు **శ్రీనివాసులు, పాండురంగప్ప**

తారకరామ • యస్ యస్ ఎ పి • ద్వారకా ఫిలింస్

THARAKARAMA



'ఏజెంట్ గోపి'లో కృష్ణ, జయప్రద

## సినిమా

### జయసుధ వన్నీ వెరైటీ వేషాలే

యువతరం "నాయకాశ్రయం"లో జయసుధకు అన్నీ వెరైటీ వేషాలు లభించడం... ఆమె చేసుకున్న అదృష్టం.

శ్రీ బాలాజీ చిత్ర నిర్మించిన "మంచి బాబాయ్" పాత్రకు, అపర్ణా మూవీస్ నిర్మిస్తున్న "కలియుగ సీత" పాత్రకు ఎంత వైవిధ్యం వున్నదో, అన్నపూర్ణా స్టుడియోస్... జగపతి పిక్చర్స్ నిర్మిస్తున్న "రామకృష్ణులు" పాత్రకు, డి.వి.ఎస్. ప్రొడక్షన్స్ నిర్మించిన "కాలాంతకులు" పాత్రకు అంత వైశిష్ట్య వైవిధ్యం వున్నదని ఆమె (జయసుధ) చెప్పింది.

విజయ... మాధవీ పిక్చర్స్‌వారి "కటకటాలు రుద్రయ్య" పాత్రకు, అజయ్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "శ్రీరామరక్ష" పాత్రకు విభిన్నమైన రూపకల్పన వున్నట్లు ఆవిడ చెప్పింది.

### కొత్త చిత్రాలు

శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైసెస్ నిర్మించనున్న చిత్రం, శ్రీ లలితా మూవీస్ ప్రారంభించనున్న చిత్రం, లక్ష్మీ ఫిలింస్ కంబైన్స్ కొత్త చిత్రం, సురేష్ ప్రొడక్షన్స్ నిర్మించనున్న కొత్త చిత్రం నేను ఒప్పుకున్న కొత్తవి, అంది జయసుధ.

ఉమాలక్ష్మి కంబైన్స్‌వారి "విచిత్ర జీవితం"లో అగ్రనటి వాణిశ్రీగారితో, అజయ్ ఆర్ట్ పిక్చర్స్‌వారి "శ్రీ రామరక్ష"లో కళాభినేత్రితో నటించడం, తనకెంతో ఇష్టమైన ఘటనగా జయసుధ పేర్కొంది.

మున్ముందు నటించే చిత్రాలు కూడా... వెరైటీ పాత్రలు గలవిగా వుంటేనే, అంగీకారం తెలుపనున్నట్లు జయసుధ వివరించింది.



### సినిమాస్కోప్ కలర్‌లో గిరిబాబు కథ

"జగమేమాయ" చిత్రం ద్వారా పరిశ్రమకొక టిపికల్ విలన్ దొరికాడన్న పట్టాన్ని సంపాదించిన గిరిబాబు గ్రేడ్ "దేవతలారా! దీవించండి" చిత్రం తర్వాత మరింత పెరిగింది. ఆ చిత్రంలోని ఉపేంద్ర పాత్రను గిరిబాబు పోషించిన విధానాన్ని ప్రశంసిస్తూ ప్రతిరోజు ఎన్నో ఉత్తరాలొస్తున్నాయి వారి ఆఫీస్‌కు. ఉపేంద్ర పాత్ర గిరిబాబు నటనా జీవితాన్ని మరో రెండు దశాబ్దాలకు పొడిగించిందని అంటే అతిశయం అవుతుందా! తమ జయభేరి సంస్థ తొలి విజయాన్ని పురస్కరించుకుని తమ తదుపరి ప్రయత్నంగా మరో స్కోప్ చిత్రాన్ని నిర్మించ దలచినట్లు గిరిబాబు తెలిపారు. ఈసారి విశేషమేమిటంటే చిత్రానికి వలసిన కథను గిరిబాబుగారే సమకూర్చడం ఒకటి; కలర్‌లో నిర్మించడం మరొకటి; జానపదం కావడం ఇంకొకటి.

ఏప్రిల్ 2 కు "దేవతలారా దీవించండి" చిత్రం వందరోజులౌతుంది. ఏప్రిల్ 23 నుండి ప్రేక్షకుల దీవెన లందుకున్న "దీవించండి" నిర్మాతలు తమ కొత్త చిత్రాన్ని ప్రారంభిస్తారు. శ్రీ కొమ్మినేని శేషగిరిరావు స్క్రీన్ ప్లే,

'అడవి రాముడు' జంగారెడ్డి గూడెంలో అర్ధ శతదినోత్సవం చేసుకున్నది. బొమ్మలో శ్రీయుతులు ఈ. లక్ష్మణరావు, జయసుధ, చంద్రమోహన్, కె. కృష్ణమూర్తి ఉన్నారు.

దర్శకత్వానికి తోడుగా పోయిన చిత్రానికి పని చేసిన సాంకేతిక నిపుణులందరూ పని చేస్తారని గిరిబాబు తెలిపారు. ఈ జానపద చిత్రంలో మురళీమోహన్ కథానాయకుడిగా నటించే అవకాశాలు ఎక్కువగా కన్పిస్తున్నాయి.

### ఆచార్యుని జగన్మోహిని

ప్రేక్షకులను తమ నైపుణ్యబలంతో విచిత్రమైన జానపద చిత్రాలతో వుర్రూతలూగించిన శ్రీ విఠలాచార్య, "జగన్మోహిని" పేరిట మాయా మంత్ర సమన్వితమైన వర్ణ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

కసితో ఆచార్యగారు కొత్త కొత్త అయిడియాలతో "జగన్మోహిని" చిత్రాన్ని బహుజనరంజకంగా రూపొందిస్తున్నారు.

ఈ వర్ణ జానపదంలో ప్రభ... నరసింహ రాజు... జయమాలిని... సావిత్రి ప్రధాన పాత్రధారులు.

### హిందీ రంగంలో ర్యాంకు

హిందీ చిత్ర సీమలో యివాల్టి రోజున నెంబర్ వన్ స్థానాన్ని అనుభవిస్తున్నది ఎవరో తెలుసా? వినోద్‌ఖన్నా... అమితాబచ్చాన్.



'దేవదాసు మళ్లీ పుట్టాడు'లో వాణిశ్రీ

ఆ యిద్దరితో సమానస్థాయిని చవిచూస్తున్న వ్యక్తి ధర్మేంద్ర. యువతరం హృదయాలను ఎక్కువగా ఆకర్షిస్తున్న నటుడు "ది గ్రేట్ రాజకపూర్" కుమారుడు రిషికపూర్.

నటీమణులలో హేమమాలిని, జీనత్‌అమన్ నెంబర్ వన్ స్థానాన్ని అనుభవిస్తున్నట్లు, వారి చిత్రాల వసూళ్లు నిరూపిస్తున్నాయి. రేఖకు మాంచి ఫాలోయింగ్ వుంది.

— శ్రీనివాస్

## జి వి జి. పే జీ

[24వ పేజీ తరువాయి]

***ఆడదంటే అలుసా?***

బాలాజీ ఇంటర్నేషనల్ వర్ణ చిత్రం తాలూకు కొన్ని సన్నివేశాలను భాగ్యనగర్ స్టూడియోలో చిత్రీకరించినట్లు తెలియజేశారు డైరెక్టర్ ఎం. మల్లికార్జునరావు, జి. వి. కృష్ణారావు నిర్మించే ఈ చిత్రంలో మురళీమోహన్, నరసింహారాజు, సత్యనారాయణ, గిరిబాబు, మాడా, త్యాగరాజు, శరత్‌బాబు, హరిబాబు, వంకాయల, గరగరరావు, ప్రభ, జయలక్ష్మి, నిర్మల, పి. ఆర్. వరలక్ష్మి, సుజాత, సరోజ నటిస్తున్నారు. మహారథి మాటలు, సి. నారాయణరెడ్డి గీతాలు, జె. వి. రాఘవులు సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పు, చంద్రమౌళి ప్రొడక్షన్ శాఖలకు బాధ్యులు.

***ఒక ఊరి కథ***

వెంకయ్యది విచిత్రమైన మనస్తత్వం. తెల్లవారేసరికి తలపాగాలు చుట్టి పనులకు బయలుదేరేవారిని చూస్తూ, "ఎవరికోసం మనం రెక్కలు ముక్కలుచేసుకోవడం?" అని అడుగుతూంటాడు. "ఎవరికోసమేమిటి? మనకోసం... మన పెళ్లాం బిడ్డలకోసం ... మన భవిష్యత్తుకోసం," అని అందరిలాగా వాళ్ళూ మామూలుగానే జవాబిస్తుంటారు. కాని, వెంకయ్య సమాధానం వేరు. "వీళ్ళంతా డబ్బున్నవాళ్ళకోసమే కష్టపడుతున్నారు. ఆ డబ్బుగల ఆసాములనే మరింత డబ్బుగలవారిని చేస్తున్నారు అలా వాళ్ళకు పని చేస్తూ చేస్తూనే చెమటోడుస్తూ, కడుపు మాడ్చుకుంటూ, ఆకలి — ఆకలి అంటూ, ఆఖరికి ప్రాణాలు వదులుతున్నారు..." అదీ వెంకయ్య భాష్యం. ప్రజలపట్ల, పనిపాటలుపట్ల విపరీతమైన వేదాంతధోరణి కనబరిచే వెంకయ్య జీవిత చిత్రణే చంద్రోదయా ఆర్ట్ ఫిలిమ్స్ వారి "ఒక ఊరి కథ." ప్రేమ్‌చంద్ కథ "కఫన్"కు మృణాల్‌సేన్ కథనం. వాసుదేవరావు, నారాయణరావు, ఎ. ఆర్. కృష్ణ, కె. కొండలరావు, మమతాశంకర్, లక్ష్మీదేవదాస్, రమాదేవి పాత్రధారులు. పి. కోదండరామిరెడ్డి సమర్పించే ఈ వర్ణ చిత్రానికి వీరేంద్రనాథ్ మాటలు, విజయరాఘవరావు సంగీతం, కె. కె. మహజన్ ఛాయ నిర్వహించారు. అల్లారెడ్డి పరంధామరెడ్డి నిర్మాత.

***చలనచిత్ర జీవిత రజతోత్సవాలు***

చలనచిత్ర జీవితంలో 25 సంవత్సరాలు పూర్తిచేసిన సందర్భంగా కళాభారతి జనునకు ఏప్రిల్ 2న హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియమ్‌లో, హాస్య కళాప్రపూర్ణ అల్లు రామలింగయ్యకు ఏప్రిల్ 8 (ఉగాది)న పాలకొల్లులో రజతోత్సవాలు జరుగుతాయి. వీరిద్దరూ నటించిన తొలి చిత్రం "పుట్టిల్లు."





'లంబాడోళ్ల రాందాసు'లో ఒక దృశ్యం

## సంక్షిప్త చిత్ర వార్తలు

★ "ఇదెక్కడి న్యాయం" అనంతరం దాసరి నారాయణరావు కథ, స్క్రీన్ ప్లే, మాటలు, దర్శకత్వంలో జగదీశ్‌చంద్రప్రసాద్ నిర్మించే లలితా మూవీస్ కొత్త చిత్రం షూటింగ్ జూన్ 23న హైదరాబాద్‌లో ప్రారంభమౌతుంది.

★ నవతావారి "పంతులమ్మ" చిత్రంలోని ఉదాత్తమైన ఇతివృత్తానికి ముగ్ధులై సెల్మోత్సవానికి యిటీవల విచ్చేసిన యుగోస్లేవియా ప్రతినిధులు ఆ చిత్రాన్ని తమ దేశంలో ప్రదర్శించేందుకు హక్కులు సంపాదించుకున్నారు లక్ష్మి, రంగనాథ్ నాయికా నాయకులుగా ఎన్. కృష్ణంరాజు నిర్మించిన ఈ వర్ణ చిత్రానికి సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు.

★ భయంకరమైన 'డెవిల్స్ డెన్' వద్దకు కోట్ల విలువచేసే రెండు విగ్రహాలు వచ్చాయని తెలిసి, వాటిని ఎలాగైనా చేజిక్కించుకోవాలని భుజంగం ముఠా అపాయాలను ఎదుర్కొనే సన్నివేశాలను సురేఖా ఆర్ట్ పిక్చర్స్ "తుఫాన్ మెయిల్" చిత్రంకోసం డైరెక్టర్ కె. ఎస్. రెడ్డి యిటీవల మద్రాసు శాంతోమ్ బీచ్ వద్ద వున్న 'కల్పనా హవుస్'లో చిత్రీకరించారు.

★ కె. బాపయ్య దర్శకత్వంలో అశ్వనీదత్ సినిమాస్కోప్‌లో నిర్మించే "యుగపురుషుడు" వర్ణ చిత్రంలో ఎన్. టి. ఆర్. సరసన హిందీ నటి కొమిల్లావిర్క్ నటిస్తోంది. ఈ చిత్రంలో లత నాయిక.

'డూడూ బసవన్న'లో శశికుమార్, ప్రవీణ



సీరియల్

# విముక్తి

ఎమ్. డి. సౌజన్య

షరీఫ్‌కి — తన ఆప్తమిత్రుడు హార్ట్ ఎటాక్‌కి గురికావటానికి అసలు కారణ మేమిటో — స్పష్టంగా అర్థమైంది.

''రవూఫ్! మీ పెద్దమ్మాయికి ఎన్నేళ్ళు ?'' అడిగాడు షరీఫ్.

''యిరవై రెండు !''

''నలభయి ఏళ్ళ బ్రహ్మచారికి — రయాపైస కట్నం లేకుండా చేసుకుంటా నంటే - ఇవ్వటానికి అభ్యంతరమా ?'' అడిగాడు షరీఫ్ !

''ఎవరైనా నీ ఎరికలో — అలాంటి వాళ్ళుంటే, చూసిపెట్టు షరీఫ్ ! ఈ పెళ్లి నువ్వే చేయించిన పుణ్యం దక్కుతుంది ! నిజంగా అలాంటి వాళ్ళెవరైనా ఉన్నారా?'' అన్నాడు, రవూఫ్ మంచం మీదనుంచి లేచి కూర్చుంటూ ! ఆశగా !

ఈ మిత్రుల సంభాషణ లోపలినుంచి వింటున్న — రవూఫ్ భార్య ఫాతిమా ''మాకు యిష్టమేనండి ! మీ ఎరికలో అలాంటి సంబంధం వుంటే వెంటనే చూడండి ! మీకు పుణ్యముంటుంది !'' అంది తలుపు చాటునుంచి

రవూఫ్ ఒక నిముషం నిశ్శబ్దంగా వుండి- ''చదువుకున్న పిల్ల — పైగా లోకజ్ఞానం తెలిసిన వయసు ! మీరిద్దరు యిష్ట పడటం — తల్లితండ్రులుగా, మీ ఆతురతనే తెలుపుతుంది! పెళ్లికూతురు ఆ అమ్మాయి యిష్టం తెలుసుకోవద్దా ?'' అన్నాడు, తన సంశయం వెళ్ళగక్కుతూ.

''మన ఆడపిల్లల్ని — 'ఎవరిని చేసుకుంటావు ? ఆ అబ్బాయి నీకు నచ్చాడా' అని అడుగుతామా ? మనం తెచ్చిన సంబంధం చేసుకోవడమే !'' అంది, ఫాతిమా — జీనత్ యిష్టాయిష్టాలతో ఏం పని లేదన్నట్టు.

రవూఫ్, భార్య మాటలను సమర్థిస్తున్నట్టు మౌనం వహించాడు.

''అలా నేను ఒప్పుకోను ! చదువుకున్న వాడివీ — లోకం తెలిసినవాడివి ! నువ్వూ యీ పద్ధతి సమర్థించటం నేను హర్షించ లేను రవూఫ్ !''

*(గత సంచిక తరువాయి)*

''ఇంతకీను అనేదేమిటి షరీఫ్ !''

''నేను చెప్పే — నాలుగు పదులు నిండిన బ్రహ్మచారిని, మనస్ఫూర్తిగా చేసుకోడానికి — మీ జీనత్ సుముఖంగా వుందో లేదో నేనే అడిగి తెలుసుకుంటాను ! ఆ... ఇంకో ముఖ్య విషయం — పెళ్లికొడుకు — మా డిపార్ట్‌మెంట్‌లో నాతో పనిచేసే నా కో పైలట్—పైలట్ కావటంవల్ల — వివాహానికి మీ అభ్యంతరం ఏం లేదుగా ?'' అడిగాడు షరీఫ్ అన్ని వివరాలు చెబుతూ.

''పదివేలిస్తానన్నా, పిల్లని చూడటానికే పెద్దవాళ్ళు రావటంలేదు ! అలాంటిది — కానీ కట్నం లేకుండా పైలట్ అల్లుడిగా వస్తుంటే అభ్యంతరమా !'' అన్నాడు సంతోషపడుతూ, రవూఫ్.

ఇంతలో జీనతే తలుపుచాటుకు వచ్చి ''నాన్నా ! వారిని లోపలికి రమ్మనండి — వారడగదలచుకుంది ఏమిటో తెలుసుకొని — నా నిర్ణయం చెబుతాను !'' అంది, ధైర్యంగా.

రవూఫ్ — ఫాతిమా — వూహించని ఆ చొరవకు ఆశ్చర్యపోతుండగా —

''నేనే ఆ పెళ్లికొడుకుని — అభ్యంతరం లేదుగా !'' అంటూ వాళ్ళని యింకా ఆశ్చర్యంలో ముంచుతూ, షరీఫ్ లోపలికి నడిచాడు.

షరీఫ్ గదిలోకి అడుగు పెడుతుండగానే ''మీరు వివరాలు చెప్పటం ప్రారంభించగానే — ఆ పెళ్లికొడుకు మీరే అని ఊహించాను !'' అన్నట్టు నవ్వి, సిగ్గుతో తల వంచుకుంది జీనత్.

జీనత్‌ను, చూడగానే షరీఫ్ ఆశ్చర్యపోయాడు !

> **జరిగినకథ** : షరీఫ్ అన్న రఫీ. వదిన ఖాతూన్‌బీబి. స్నేహితుడు రవూఫ్ కూతురు జీనత్‌ని వివాహం చేసుకుంటాడు షరీఫ్.

''మొన్న మొన్నవరకు చిన్నపిల్లగా — కొన్నేళ్లక్రితం పసిపిల్లగా నా వళ్ళో కూర్చొబెట్టుకుని ఆడించింది యీ అమ్మాయినా ! యింత తక్కువ వ్యవధిలో యిన్ని వంపుసొంపుల్ని సంతరించుకొని పొన్నచెట్టులా, యింత అందంగా వుంది !

ఎప్పుడో సుర్వాల్ కమీజుమీద దుపట్టా (రెండు భుజాలమీది నుంచి వేసుకునే బట్ట) వేసుకొని, 'అంకుల్ — అంకుల్' అంటూ చురుకైన కళ్లతో చనువుగా ఆడుకునేది

ఇప్పుడు లేతగులాబి పాత చీరెమీద, అదే రంగు జాకెట్‌తో మెడ బోసిగా వున్నా, మహాశిల్పి తీర్చిదిద్దిన పాలరాతి బొమ్మలా వుంది.

''రండి ! కూర్చోండి !'' అంది జీనత్ చనువుగా.

''థ్యాంక్స్ ! ఈ పెళ్లి నీ కిష్టమేనా జీనత్ ?'' అడిగాడు, షరీఫ్ ఏ విధమైన డొంకతిరుగుడు ప్రశ్నలు లేకుండా.

''ఇష్టమే !'' వెంటనే రకీమని సమాధానం చెప్పింది, జీనత్

''నీ వయసెంత ?''

''మీ వయసులో సగం కావచ్చు ! కాని, అది దాంపత్య జీవితానికి ప్రతిబంధకం ఏ విధంగానూ కాదు !'

''నా ఉద్యోగం ఏమిటో తెలుసుగా ?''

''తెలుసు ! ఎయిర్‌ఫోర్స్‌లో పైలట్!''

''నాకు మనవాళ్లెవరూ పిల్లనివ్వటానికి ఇంతవరకు ముందుకు రాలేదు ! కారణం తెలుసా ?''

''మిలిటరీలో - ముఖ్యంగా విమానాలు నడిపేవారికి, మనవాళ్లెవరూ పిల్లనివ్వరు ! పైలట్ భార్య అయినంత మాత్రాన, నా భవిష్యత్తుకు భద్రత వుండదేమో అని భయపడే మనస్తత్వంకాదు, నాది ! ఐతే నా జీవితంతో ముడిపడివున్న ఓ ముఖ్య విషయం కాస్త వివరంగా నీకు చెప్పాల ! మీ నాన్నకు చెబుదామంటే, ఇప్పుడు ఆయన ఏ మాటా వినిపించుకునే స్థితిలో లేడు !''

''ఆయన వినిపించుకోంది నేను విని మాత్రం చేసేదేముంది ! బైదిబై బహుశా మీకు యెవరైనా చెప్పారోలేదో తెలియదు ! ?'' అని జీనత్ అర్థోక్తిలో ఆగిపోయింది.

''ఏమిటది ?''

''నాకు పెళ్లి సంబంధాలు ఏవీ రాకపోవ టానికి కారణం — నా చదువుతోపాటు మరోటీ వుంది ?'' అంటూ సంశయిస్తున్నట్టు, తల వంచుకుంది, జీనత్.

''నిరభ్యంతరంగా చెప్పు జీనత్! నో యిహెడ్!'' ప్రోత్సహిస్తున్నట్టు ప్రసన్నవదనంతో, అన్నాడు, షరీఫ్

''నేను, శారద, శరత్ కలిసి ఒకటవ క్లాసు నుంచి ఒకే క్లాసులో చదువు కున్నాము! శారద శరత్ చెల్లెలు! మేము చిన్నపిల్లలుగా మామధ్య ఏ అరమరికలు లేకుండా వాళ్లింటికి మేము, మా ఇంటికి వాళ్లు వస్తూ పోతూ వుండేవాళ్లం! పెద్దవాళ్లమయినా, మా స్నేహానికి ఏ అడ్డుగోడలు లేవు! శారదకు పెళ్లయి వెళ్లిపోయినా, శారద అన్నయ్య, శరత్, మా యింటికి తరచు వస్తుండేవాడు! నేను వ్యక్తురాలైనా మా చిన్నప్పటి స్నేహాన్ని పురస్కరించుకొని, అతను మా ఇంటికి అప్పుడప్పుడు వస్తూండేవాడు!

ఓ రోజున, మా అమ్మ శరత్‌ను మా ఇంటికి రావద్దని గట్టిగా మందలించింది.

అతను లోపల బాధపడ్డా, నవ్వుతూ వెళ్లిపోయాడు.

ఓసారి మా నాన్నకు డబుల్ టైఫాయిడ్ వచ్చి నాలుగునెలలు ఇంట్లోనే వుండిపోవలసి వచ్చింది! ఎక్కడైనా ఏ చిన్న ఉద్యోగం చేసయినా నాలుగురాళ్ళు సంపాదిస్తానని, మొండిగా మా అమ్మ మాట వినకుండా శరత్ వాళ్లింటి కెళ్లాను! నా పరిస్థితి వివరించాను! ఏదోవిధంగా మా కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకోవాలన్నాను అప్పటికే అతను, ఏదో పరీక్షకు ఓ ప్రక్క చదువుతూనే, సాయంత్రం యిద్దరు ఆఫీసర్ల పిల్లలకి, యింట్లో ట్యూషన్లు చెబుతున్నాడు అతనికి ఆ నలుగురు పిల్లలమీద నెలకో వంద వస్తూంది. నామీద జాలితో ఆ నలుగురికి నన్నే ట్యూషను చెప్పి, ఆ వందరూపాయలు నన్నే తీసుకోమన్నాడు

ఆ క్లిష్టస్థితిలో అదే మహాభాగ్యంగా ట్యూషన్లు చెప్పటానికి వొప్పుకున్నాను.

రోజూ లైబ్రరీకని బయలుదేరి—సరాసరి శరత్ వాళ్లింటి కెళ్ళి, ఆ పిల్లలకి ట్యూషను చెప్పేదాన్ని. అలా నెల గడిచింది

ఆరోజు నేను యింటికి ట్యూషను డబ్బుతో వెళ్లేసరికి ''జీనత్! నువ్వు ఎక్కడినుంచి వస్తున్నావో నిజం చెప్పు!'' నిలదీస్తూ అంది, అమ్మ రౌద్రాకారంతో.

''... ..........'' నిశ్చేష్టురాలనై ఏం చెప్పలేక భయంతో అమ్మవంక చూశాను! ?

''ఇందాక నీకోసం సత్తార్‌ను లైబ్రరీకి పంపాను! నువ్వు అక్కడ లేవట ఎక్కడికెళ్లావు శరత్ యింటికేనా ?'' అంది

[36వ పేజీ చూడండి]

# ప్రశ్నావళి



—కె. రామలక్ష్మి

ఇ. ఎస్. కె. ఆర్. — కపిలేశ్వరపురం

జీవితంలో తల్లికంటే మిన్నగా ప్రేమించే వదినమ్మ వస్తుందని ఆశించి ఆ ఆశ నిరాశగా మారినప్పుడు అనుభవించే బాధకు మీ నిఘంటువు లోని ఒక్క పదం ?

★ అత్యాశ! అయినా తల్లి తల్లే ఒదిన ఒదినే... ఒదినకు మాత్రం వ్యక్తిగతమైన జీవితం వుండదా ? ఒక పరిధి దాటి ఎవరి జీవితంపైనా యింకొకరు ఒత్తిడి తెచ్చే హక్కు ఎవరికీ వుండ కూడదని నా నమ్మకం. ఒదినని ఒదినగారిగా గౌరవాభిమానాల చూసినప్పుడే — అనుబంధం పటిష్ఠమయ్యేది.

వై. జగదీశ్ — కర్నూలు

ఈ జీవితం ఎప్పటికైనా అర్థం అవుతుందా?

★ అవుతుంది. కాని అప్పటికి టూలేట్ అయిపోతుంది !

వి. ఆర్. ఎం. - హైదరాబాదు

ముద్దు పెట్టుకొన్నప్పుడు స్త్రీలు కళ్ళు మూసుకుంటారెందుకు ?

★ ఏమో. ఏం చూడవలసివస్తుందోనని కాబోలు ! ప్రేమా, కామం, కోర్కె... అన్నీ కళ్ళ తోనే కదా తెలిసేది !

పి. ఎస్. ఎస్. — తిరుపతి

దేవుడే మనలాంటి జీవులను ఆడ—మగ అని సృష్టించి వేరు చేస్తే — మీరేమిటి ఆడ మగ సమం అంటారు ?

★ కాక ? ! ఆడా—మగా వేరు కాని సమానం కాదని అనలేదే !!

ఎస్. ఎన్. ఆర్. — తాడిపత్రి

మీ సమాధానములు చదివి కొందరు స్త్రీలే మిమ్మలను ద్వేషిస్తున్నారు కారణం ?

★ స్త్రీలు కదా ! నిజాన్ని మభ్యపెట్టి చెప్పకపోతే — సహించలేరు !

ఎ. బి. — నడిపూడి

ఆడ పేర్లతో రచనలు చేసే మగవారిని ఏమనాలి ?

★ ఆడారి మగవారు ! సినిమాలో కామెడీకి పనికొచ్చేవారిలాగే వీళ్ళూ — అవకాశం వచ్చేదాకా ఆడ పేర్లు వాడుకొంటూ — ఎలాగైనా తమ అసలు నామధేయం బయటపడేయాలని తహ తహ లాడిపోతూ' నేను ఫలానా పేరుతో కథలు రాస్తాను... పుస్తక రూపంలో తెస్తారా ? అంటూ ప్రచురణ కర్తలకి రాస్తూంటారట !

ఎ. ఆర్. ఆర్. — కలకత్తా

గుడిలో పూజ చేస్తున్నప్పుడు గంట ఎందుకు మ్రోగిస్తారు ?

★ ముహూర్త ఘడియలో 'బాజాలు గట్టిగా వాయించండోయ్' అని ఎందుకంటారు ? ఎవరి శాపనార్థాలూ, తిట్లూ, తుమ్ములూ వినరాకుం డాను. బహుశా—గుడిలో గంటా అందుకేనేమో-

పి. వి. ఎస్. — వినుకొండ

మమ్మలను అడిగే ప్రశ్నలు మిమ్మలను యిబ్బందిపెట్టేవిగా వుండడానికి కారణం ఏమిటంటారు ?

★ మానవ సహజమైన కుతూహలం — "బదులు చెప్తుందా ? మానుతుందా ?" అని !



(–) (–) (–) 'నాలాగ ఎందరో' లో రూప, లక్ష్మీకాంత్ (–) (–) (–)

యు. యు. — ఎమ్మిగనూరు

స్త్రీ సహజ లక్షణం ?

★ మనసులో మాట చెప్పకపోవడం ;

జి. ఎస్. ఆర్. — కర్నూలు

పోస్టుగ్రాడ్యుయేట్ అమ్మాయి గ్రాడ్యుయేట్ కాని అబ్బాయిని పెళ్ళాడవచ్చా ?

★ మహారాజులాగా ! డిగ్రీ ఉద్యోగానికేగాని సంస్కారానికి కొలబద్దకాదు.

ఆర్. జె. ఎల్. — విశాఖపట్నం

భర్త ఏదో అన్నాడని భార్య తన సరదాలకి స్వస్తిచెప్పి జీవచ్ఛవంలా పడివుండి సాధించే దేమిటి ?

★ ఏమీ లేదు. ఒక్క భర్తను తప్ప ! కోపం వచ్చి ముక్కుకోసుకోడం లాంటిది — యిష్టాయిష్టాలను వదులుకోవడం. సంసారం సవ్యంగా సాగాలంటే — యిద్దరి సరదాలూ ఒక్కటే కావాలని రూలు లేదు. కాని ఒకరివి యింకొకరికి ఎదురు కాకుండా చూసుకోవాలి.

ఎన్. వి. ఆర్. — జగదల్‌పూరు

ఆనాడు ఏకలవ్యుడు గురుదక్షిణ ఇవ్వకపోయి వుంటే ... మహాభారత కథ ఎలా వుండేది ?

★ అడ్డంతిరిగేది ! అర్జునుడు కాస్తా అమ్‌జద్‌ఖాన్ అయి హడలెత్తించేవాడు !

బి. ఎస్. — పెద్దపల్లి

సాహిత్యపరమైన విజ్ఞానం పెంచుకోవాలని నా కోరిక. అందుకై మీ సలహా ?

★ సాహిత్యాన్ని 'బోధించడం' సాహిత్యాన్ని పెంపొందించుకోడం. ఎలాగో చెప్పడం కష్టం. కాని సాహిత్యాన్ని తమ తమ ఇజాలకు కట్టేసి ఆచార్యత్వం వహిస్తూన్న పెద్దలు చాలామంది వున్నారు కనుక ఈ ప్రశ్న వారికి వేస్తే — సరైన దారి చూపిస్తారు !

వై. వి. జె. ఆర్. — జెమ్‌షెడ్‌పూరు

ఆపదలో వున్నప్పుడు సహాయపడేవారు బంధువులా ? స్నేహితులా ?

★ అంతా సహాయపడవచ్చు. కాని తరవాత దెప్పితే — వారిని బంధువులుగానూ, మరిచిపోతే — వారిని స్నేహితులుగానూ మీరు గుర్తుపెట్టుకోవాలి.

ఎ. జె. ఆర్. — ఎలమంచిలి

కొద్ది రోజుల క్రిందట పేపరులో బ్రాహ్మణులని విమర్శించారు మీరేమంటారు ?

★ నోరు మూసుకు పడివుంటాను. 'బాబూ నేనేం చేయలేదు' అంటే 'నీ తాత ముత్తాతలు చేశారులే' అన్నట్లు తోడేలూ మేకపిల్లా కథలాగా తయారయింది — బ్రాహ్మణ బ్రతుకు. ఇక ప్రభుత్వమే పూనుకొని యీ జాతిని 'నియో వెనుకబడిన'దిగా గుర్తించి ఆదుకోవలసిన రోజులు — అట్టే దూరంలో లేవు. ఆర్థికంగా వెనుకబడినతనానికి బ్రాహ్మణ అబ్రాహ్మణ ఏమిటి ? అంతా ఒకటే !

వనితలకు మనవి

కొత్తరకం వంటలు స్పష్టంగా వ్రాసి పంపితే త్వరగా పరిశీలించ వీలు —సం.



## విముక్తి

(33 వ పేజీ తరువాయి)

"ఔను!" అన్నాను, భయపడుతూనే.

"దేనికి? చెప్పు! చెప్పవే!" అంటూ, నా జుట్టు పట్టుకొని వళ్ళంతా వాతలు తేలేట్టు కొట్టింది

ఆ బయం - బాధతో— నా చేతిలోని పదిరూపాయల నోట్లు కింద పడ్డయ్!

"ఏమిటే! ఈ డబ్బేమిటే! ఎక్కడిది! ఛీ! ఛీ! నా కడుపున నీలాంటిది ఎలా పుట్టిందే! నిజంచెప్పు! నిన్ను చంపేస్తాను!" అంటూ కత్తిపీట పైకెత్తింది

అంతలో— మా చెల్లెలు నస్రీన్, మా తమ్ముడు సత్తార్— ఆమె కాళ్ళు పట్టుకొని ఏడ్వటం మొదలుపెట్టారు.

అంత నీరసంలోనూ, నాన్న మంచంమీద లేచి కూర్చుని "ఏమిటమ్మా జీనత్ ఇలారా తల్లీ! ఈ డబ్బెక్కడిదమ్మా! చెప్పు చెప్పమ్మా నా తల్లివి కదూ!" అంటూ బుజ్జగింపుతో అడిగారు.

నాకు దుఃఖం పెల్లుబికింది.

"నాన్నా" అంటూ ఆయన వడిలో తల పెట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ— జరిగిందంతా చెప్పాను.

నా మాటలు వింటూనే ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"కన్నతండ్రి అసహాయతకి జాలిపడి — ఆడపిల్లనైనా—అపవాదు లెక్క చేయకుండా నీ చేతనైంది యీ కుటుంబానికి చేయటానికి కష్టపడి సంపాదించావా తల్లీ! కన్నతల్లి— తన రక్తమాంసాలు పంచుకు పుట్టినబిడ్డనే అపార్థం చేసుకునే పరిస్థితు లమ్మా మనవి!" అన్నారు నా తల నిమురుతూ!

అంతవరకు అమ్మ కొట్టిన దెబ్బల బాధ ఒక్కక్షణంలో, మాయమై నట్లనిపించింది.

"వెళ్ళమ్మా! ఇక ఎవరేమనుకున్నా నాకు బాధలేదు. ఫాతిమా... నా బిడ్డలు ...రత్నాలే! చూడవే ఆడపిల్లయి నా యింటికి పెద్దదయి తన బాధ్యత నెలా నెరవేర్చిందో అనుకోనివ్వవే అనుకొని ఎవరెలా అనుకోవాలనుకుంటే అలా అనుకోని" అన్నారు.

దాంతో నేను యింకా ఎక్కువమంది పిల్లలకి ట్యూషన్లు చెప్పటానికి సిద్ధపడ్డాను. శరత్ తను అండగా నిలిచి— నా కోసం ఎంతోమంది ఆఫీసర యిళ్ళకు వెళ్ళి వాళ్ళకు నచ్చజెప్పి, వప్పించి, నా ట్యూషన్ ఆదాయం పెరిగేట్టు చేశాడు

కాని చివరికి అమ్మ భయపడ్డంతా అయ్యింది. నాన్న విశాలదృక్పథం అందరూ అపార్థం చేసుకున్నారు చివరికి శరత్‌కూ నాకూ సంబంధం అంటగట్టారు. తర్వాత మేమిద్దరం వివాహం చేసుకో బోతున్నట్టు వదంతులు వ్యాపించాయి ఎవరు పెళ్ళి సంబంధానికి వచ్చినా శరత్‌కు నాకు సంబంధం వుందని చెప్పటం సాగించారు. ఫలితంగా— చివరికి నేను బలి పశువు నయ్యాను.

మా యిద్దరిమీద లేచిన దుమారానికి శరత్ బాధపడ్డాడు. కొన్నాళ్ళు నాతో మాట్లాడలేదు. కనపడ్డా ప్రక్కకు తప్పుకునేవాడు, కావాలనే తప్పుకు తిరిగేవాడు.

చివరికి అతను— నా ప్రాణం కాపాడే ప్రయత్నంలో— ఓ పెద్ద ప్రాణాపాయం నుంచి బతికి బయట పడ్డాడు. "మీ పిల్ల కోసం— మావాడు ప్రాణం మీదికి తెచ్చుకున్నాడు! మీ అమ్మాయి మా యింటికి రాకుండా చూడండి" అంటూ శరత్ నాన్నగారు మా నాన్న ఆపీసునుంచివస్తుంటె కలిసి చెప్పారట.

చివరికి గత్యంతరంలేక మా వాళ్ళ విమర్శకి తట్టుకోలేక ట్యూషన్ చెప్పడం మానివేసాను. ఈ విషయం మీకు చెప్పటం నావిధి. అందుకే సాహసించి చెప్పాను" అంది జీనత్.

షరీఫ్‌కి— జీనత్— నిర్మొహమాటంగా ఏ అరమరికలు లేకుండా ఉన్న విషయాలు వున్నట్టు చెప్పినందుకు, ఎంతో సంతోషం వేసింది.

వివాహానికి ముందే ఇలా వధూవరులు మనసు విప్పి మాట్లాడుకోవటం మంచిదే అనిపించింది యిద్దరికి.

"జీనత్! నువ్వింత దాపరికం లేకుండా అన్ని వివరాలు చెప్పినప్పుడు నేనూ ఓ ముఖ్య విషయం నీకు చెప్పాలి! అది నా నైతిక బాధ్యత కూడాను..." అంటుండగా.

జీనత్ తల్లి ఫాతిమా వచ్చి "అమ్మాయ్ జీనత్! మీ ఖతీజా పిన్ని రిక్షా దిగుతోంది! మీ రిద్దరు యిలా మాట్లాడు కోవటం చూసిందంటే- యిల్లుపీకి పందిరేస్తుంది, త్వరగా ప్రక్కగదిలోకి వచ్చేయ్!" అంది కంగారుగా.

జీనత్ అసహాయంగా, షరీఫ్ వైపు చూసింది

షరీఫ్ నిట్టూరుస్తూ తనూ బయటి కొచ్చాడు

"భోజనానికి వుండండి! ప్లీజ్!" అంది జీనత్ చెల్లెలు నస్రీన్.

"వాళ్లక్కయ్య చెప్పింది కాబోలు" అను కున్నాడు షరీఫ్.

"కతికితే అతకదేమో!" అంది ఫాతిమా బెరుగ్గా.

### 3

"ఇదిగో విన్నావా వదినా ! జీనత్ పెళ్ళి రేపు గురువారమేనట !" అంది ఓ గంగా భగీరథి సమానురాలు.

"ఏ జీనత్ పెళ్ళి?" కొంపతీసి సబ్ పోస్ట్ మేష్టర్ రవూఫ్ కూతురు. ఆ ఘోషా పర్దా లేకుండా బడితెలా తిరిగిన పిల్లేనా! దాన్ని చేసుకునేదే తల మాసినోడు !" తన అక్కసంతా వెళ్లగక్కుతూ అంది- రెండో పూర్వ సువాసిని ఆశ్చర్యంగా.

"ఇంకెవరు- విమానాలు నడిపే ముసలి బ్రహ్మచారి హుస్సేన్‌బీ కొడుకు షరీఫ్!వాడు మా పెద్ద మనవడి యీడు వాడు. మా మనవడికేమో అప్పుడే అల్లుడొచ్చాడు! ఇప్పటికీ యీ షరీఫ్‌కి యింకా పెళ్ళి కాలేదు. అయినా అంత యీడు వాడిని, ఆ పిల్ల ఎలా చేసుకోడానికి ఒప్పింవారే!"

"నీ లాగ నాలాగ- అది అక్షరం ముక్క రాని ముద్దు కాదే! కాలేజీల్లో చదివింది! దాన్ని ఒప్పించడంకాదు అదే- 'నేను చేసు కుంటాను 'షరీఫ్‌ని'- అని పట్టు బట్టిం దిట."

ఇలా 'ఇదిగో పులి- అంటే అదిగో తోక' అన్నట్టు ఆ పేటలో చిన్నా పెద్దా- ఆ పెళ్ళిని గురించి- వింత వింతగా చెప్పు కున్నారు.

సోమవారం ఉదయమే జీనత్ మేనత్త బందరు నుంచి దిగింది. ఆమె రావటం రావటమే రజియా తండ్రిని చూస్తూనే- "ఒరేయ్ తమ్ముడా! చూస్తూ చూస్తూ బంగారు బొమ్మలాంటి పిల్లను విమానాలు నడిపే వాడికి కట్టబెట్టి దాని గొంతు కోస్తున్నారా! ఫాతిమా మీ ఆయనకు మతి లేకపోయినా కనీసం నువ్వయినా... చెప్ప కూడదటమ్మా వదినా !" అంది కళ్లనీళ్లు కుక్కుకుంటూ.

రవూఫ్ ఫాతిమా దంపతులు వెంటనే ఏం మాట్లాడలేకపోయారు.

"అవునులేరా వ్యక్తురాలై అది నాలుగు రోజులు కాలేజీకి వెళ్లి చదువుకున్న పాపానికి అందరూ దానిమీద కత్తి కట్టారు! మీలాగ ఆడవాళ్ళంతా కూపస్థ మండూ కాల్లా వుంటేనే కాని, ఘోషా- పర్దా- అంటూ వేళ్ల ఆటలు సాగవు" అంటూ కసిగా సంఘాన్ని లక్ష శాపనార్థాలు పెట్టింది.

ఆ రాత్రి జీనత్ ముఖానికి- ఓ ముసలి ముత్తయిదువు మొదటిసారి 'బిస్మిల్లా' అంటూ పసుపు రాసి, పెళ్లి కార్యక్రమా లకు నాంది పలికింది.

ఆ శుభ ముహూర్తాన్ని పురస్కరించు కొని ఆదర్శ గృహిణిగా వధువుకు శుభాలు కలగాలని, అంతా ముత్తయిదువులు కలసి పాటలు పాడారు.

ఆ శుభ సమయంలో- అరమరికలు- వయోభేదాలు మరచి ఒకళ్ల నొకళ్ళు ఎగ తాళి చేసుకుంటూ ఒకళ్ళ కొకళ్లు పసుపు రాసుకొని- నవ్వుకున్నారు. ఓ అయిదు నిముషాలు వాళ్లంతా తమ తమ వయో భేదాలు మరచిపోయారు.

"ఇంత పసుపు నా చీరంతా పులిమావు! నిన్ను వదిలితే అన్నయ్య ఊరుకుంటాడా!" అని ఒకావిడంటే

"నీ యిష్టం వచ్చినట్టు పసుపు రాసుకో! ఇక్కడ నీబోటి పండగల్తేటుంటా రనే నేను పాతచీరె, చినుగులది కట్టు కొచ్చాను!" అంది ఆవిడ కొంటెగా.

"అమ్మా! ఈ అబ్బాయి చూడవే! పసుపు నా కంట్లో రాసాడు!" అంది ఓ ఆరేళ్ల చిన్నసైజు రోలరులావున్న పిల్ల, తల్లితో కంప్లైంట్ చేస్తూ.

"చేతనైతే నువ్వూ రాయవే! నంగనాచి టుంగుబుర్రా!" అంది ఆ అబ్బాయి తల్లి, తన కొడుకును, వెనకేసుకొస్తూ.

"అరుగో మగపెళ్ళివారి ఆడంగులు వచ్చారు- పెళ్లికూతురికి పసుపు రాయ టానికి?" అని అరిచారెవరో.

ఇంతలో ఎవరో చిన్నపిల్ల పుటుక్కున తుమ్మింది.

"శుభమా అని ఇంట్లో అడుగు పెడు తుంటె- ఎవరది! కాస్త పిల్లల్ని దూరంగా వుంచలేరా?" అంటూ ఖస్సుమంది, పెళ్లి కొడుకు వదినె- ఖాతున్ బీబీ! అంతవరకు సందడిగా పెళ్లి కళతో కలకలలాడిన యిల్లు ఒక్కసారి నిశ్శబ్దమైపోయింది.

"అది తుమ్ము కాదులేమ్మా! పసిపిల్ల దగ్గింది. అదే కనబట్టంలా- జలుబు చేసి ముఖం ఎలా వుబ్బరంగా వుందో" అంటూ సర్దిచెప్పింది ఒక ముత్తయిదువు.

పెళ్లికొడుకు చిన్న చెల్లెలు నస్రీన్- తను ఆడుబిడ్డ నన్న అధికారంతో- తను ముందు పెళ్లికూతురికి పసుపు రాస్తానంది.



"ఏమిటే- పెద్దదాన్ని నే నుండగా. నువ్వేమిటి నక్శీన్! తప్పుకో" అంటూ ఒక్క కసురు కసిరింది పెళ్ళికొడుకువదిన- ఖాతున్ బీబీ.

ఆమె మాట ధోరణికి పెళ్ళికూతురు చెల్లెలు రజియా కాస్త భయపడి తల్లి వెనక్కు నక్కినట్టు వెళి పోయింది.

పెళ్ళికూతురుకి "ఇంటి పెద్ద కోడల్ని నేను! ఇకనుంచి నువ్వు నా అధికారానికి లోబడి వుండాలి" అన్నట్టు విసురుగా పసుపు జీనత్‌ముఖాన పులిమింది ఖాతున్‌బీబీ.

జీనత్ తల్లి బెల్లపు లడ్డు పళ్లెం అందించింది. ఆవిడికి. ఆ పళ్లెంలో ఓ లడ్డుముక్క కొరుకుతూ- మూతి ముప్పయి వంకర్లు తిప్పుతూ "అబ్బ! నూనెతోచేసిన బెల్లపు లడ్లు. ఇదిగో పిన్నీ! మా మరిది జటకాబండి డ్రైవరుకాదు! మేము సరేలే మాదేముంది! కాస్త అల్లుడి హోదా- అదన్నా గుర్తు పెట్టుకోండి" అంది రుసరుస లాడుతూ.

జీనత్‌తో సహా అక్కడ చేరిన చిన్నా పెద్దా- అదిరిపడ్డారు. ఆమె ఏంతధోరణికి.

"బాహోయ్! మా తోడికోడలితో- కాస్త జాగ్రత్తగా మెలగాలి కాబోలు" అనుకుంది జీనత్- లోలోపల భయపడుతూనే.

"పెళ్ళికి పెద్ద ఖర్చులు వద్దు! నేనూ నా ఫ్రెండ్స్‌ని పిలవటంలేదు. మీరూ వీలైనంత తక్కువలో కానివ్వండి" అన్నాడు షరీఫ్.

అయినా- రవూఫ్ అల్లుడికి ఓ టెర్లిన్ సూట్ కుట్టించాడు. ఓ వెయ్యి రూపాయల ఖర్చుతో ఒక పెద్ద డేకిషాతో సన్న బియ్యపు నెతి పలావు (బిర్యానీ) వండించాడు.

కూతురుకి నాలుగు సిల్కు చీరెలు ఓ జత బంగారు గాజులు మెళ్లో ఓ వంటిపేట గొలుసు కొన్నాడు.

"ఏమిటండీ! ఏమిటి... ఇంత డబ్బు ఎక్కడిది! మనం ఏవిటి? మన స్తోమత ఏమిటి? ఇలా జమీందారుల్లా డబ్బు ఖర్చు పెడితే- ఇంక ఇంకో అమ్మాయి- రజియా దాని తరువాత మగపిల్లవాడు- సత్తార్- వున్నారు! వీళ్లందరినీ ఏం చేస్తారు" అంది ఆవేదనగా.

"ఫాతిమా! మన ఇబ్బందులు ఎప్పుడూ ఉండేవే! కాని నెలకు రెండువేలు సంపాదించే



అయినా- అతని స్థాయిని గౌరవించటాని కైనా మనం ఇబ్బంది పడక తప్పదు! అయినా ఆ వచ్చే ఇబ్బందులు పడేవాణ్ణి నేను! ఇక ఆ విషయం ఎత్తకు." అన్నాడు రవుఫ్

ఆ రోజు గురువారం. రంగు రంగుల షామియానా కింద- అత్తగారు కుట్టించిన కొత్త టెర్లిన్ సూట్‌లో- పెళ్ళికి వచ్చిన పెద్దలతో బంధువులతో కలిసివచ్చి కూర్చున్నాడు- షరీఫ్! అతని మేనమామ వాలీ సులేమాన్- పెళ్ళి పెద్ద అయ్యాడు. షరీఫ్‌కి ఒకప్రక్క- అతని అన్న రఫీ- మరో ప్రక్క పెండ్లికి పౌరోహిత్యంవహించే ఖాజీ కూర్చున్నారు!

ఖాజీ తన దగ్గరున్న 'వివాహాలు- వాటి వివరాలు నమోదుచేసే పుస్తకం'లో పెండ్లికొచ్చిన పెద్దల్లో నుంచి- ఒక మధ్యవర్తిని మరో ఇద్దరు పెద్దల్ని సాక్షులుగా ఎన్నుకొని వాళ్ళపేర్లు- వాళ్ళ వయసు రాసుకున్నాడు.

"ఫలానావారి కుమారుడైన జనాబ్ రౌఫ్ సాహెబ్- తన జ్యేష్ఠ పుత్రిక- కుమారి జీనత్ బేగంను- ఫలానా వారి ద్వితీయ పుత్రుడు-జనాబ్ షరీఫ్‌సాహెబ్‌కు ఇవ్వటానికి పెళ్ళి నిశ్చయమైంది! కాబట్టి మధ్యవర్తిగారు- ఇతర సాక్షులతో కలిసి- ఈ వివాహానికి పెండ్లి కుమార్తె సమ్మతి తెలుసుకొని- ఆమెకు అయిదు వందల రూపాయలు మహర్ (ఓలి) ఇవ్వటానికి పెండ్లి కుమారుడు నిశ్చయించి వున్నట్టు తెలిపి దీనికి ఆమె సమ్మతించినట్టు సభాముఖంగా వెల్లడించండి" అన్నాడు.

ఆ ముగ్గురు పెద్దలు లోపలికి వెళ్ళి — ఖాజీగారు చెప్పిన మాటలు చెప్పగానె జీనత్ తన ఇష్టాన్ని తెలుపుతూ 'అలహందు లిల్లా' (ఇష్టమే)అంది- మూడుసార్లు.

అలా లోపలికొచ్చి ఖాజీగారు అడుగమన్న ప్రశ్నవేసే మధ్యవర్తికి తగిన జవాబుగా 'అలహందు లిల్లా' అనమని — జీనత్‌కు, అంతకు ముందే, ఆమె మేనత్త చెప్పి వుంచింది.

పెళ్లికుమార్తె ఇష్టాన్ని, మధ్యవర్తితోసహా, మిగిలిన ఇద్దరు సాక్షులు ధృవపరుస్తూ విన్న తరువాత, ఖాజీగారు ఇచ్చిన పుస్తకంలో జీనత్ చేత పెండ్లి

కుమార్తెగా సంతకం పెట్టించుకున్నారు వాళ్ళు.

అవి పూర్తికాగానే పెండ్లి కుమారుడి చేత అదే పుస్తకంలో సంతకాలు జరిగాయి. ఖాజీగారు పెళ్లి కుమారుడి చేత కొన్ని పవిత్ర మంత్రాలు చెప్పించి పెళ్లి కార్యక్రమం ముగించారు

వెంటనే పటికబెల్లం, బిస్కట్లు, సీమ బాదం కలిపి అయిదుసార్లు పెండ్లి కుమారుడి మీద సాంప్రదాయాను సారంగా విసిరారు! కొందరు వృద్ధులు "నూతన వధూవరులు చిలకా గోరింకల్లా ఆదిదంపతుల్లా సుఖశాంతులతో ఆదర్శ జీవితం గడపాలని" శుభాశీస్సులను తెలిపే పాటలు పాడారు.

జీనత్‌కు యీ వివాహ పద్ధతి నచ్చలేదు! పైగా యీ ముస్లిమ్ వివాహ సాంప్రదాయాలు వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా వున్నట్లు విని వుంది.

ఆమెకు తను ఒకచోట ఘోషాగా ఎర్రటి వాయిలు జాకెట్, ఎర్ర చీరె, ఎర్రటి మేలి ముసుగులో ఎక్కడో ఓ మూరుమూల తల వంచుకొని, కళ్లు మూసుకొని కూర్చోవటం ఎందుకో అర్థం కాలేదు

పెళ్లికొడుకు నలుగురు పెద్దల్లో బంధుమిత్రులతో ఎక్కడో మరోచోట.

జీవిత భాగస్వాములయి భవిష్యత్ జీవితంలో వచ్చే ఒడుదుడుకుల్ని సహనంతో సమానంగా పంచుకోవలసిన వాళ్లు జీవితంలో అత్యంత మధురమైన వివాహ ఘట్టం యిలా దాగుడు మూతలాడినట్లు తెరచాటు బాగోతంగా ఏమిటిది అనుకుంది కోపంగా

అన్నిటికంటే ఆమెకు పెళ్ళికొడుకు పిన్ని తన మెడలో నల్లపూసల తాడు కడుతున్నప్పుడు వళ్లంతా కంపర మెత్తింది.

మధ్యాహ్నం అతిథులకు భోజనాల ఏర్పాట్లు ఓ ప్రక్క జరుగుతుంటే ఓ ప్రక్క ముత్తయిదువులు జీనత్‌కు మల్లెపూల జడ వేశారు.

రాత్రి చీకటి పడగానే తలంబ్రాల కార్యక్రమం ముగిసింది. ఆ రాత్రే తొమ్మిది అయ్యేసరికి— నూతన వధువు జీనత్—షరీఫ్‌తో కలిసి— టాక్సీలో అత్తగారింటికి వచ్చింది.

సాంప్రదాయం ప్రకారం ఆరోజు రాత్రికే దంపతులకు శోభనం ఏర్పాటు చేయబడింది.

పెళ్ళికొడుకుకి వరుసకు అక్కయ్య అయ్యే ఓ ఆవిడ వెండి పళ్ళెంలో మీగడ పెరుగుతో కలిపిన అన్నం లేచి రనే కొత్త దంపతులకు ముద్దలుచేసి తినిపించింది.

"అబ్బాయి మన సెరిగి మసులుకోమ్మా" అంది ఓ ముసలి ముత్తయిదువు, పెళ్లికూతురు చెవిలో రహస్యంగా.

## విముక్తి

పెళ్ళికొడుకు వదిన ఖాతూన్ బీబీ, 'మా మరిది అమాయకుడేనమ్మా! మరీ కొంగున ముడేసుకోకు!'' అంది ఆట పట్టిస్తూ— మరో ప్రక్క తన అక్కసంతా వెళ్ళగక్కుతూ.

ఓ చిన్న గదిలో, పాత పందిర మంచాన్ని మల్లెపూల దండలతో చమ్కీ దండలతో అలంకరించారు. సాంబ్రాణీ ధూపం వేసి, అగరవత్తులు వెలిగించారు.

''పెళ్ళికొడుకు పేరుచెప్పి పెళ్ళికొడుకు చెయ్యి పుచ్చుకోవాలి''అంటూ పెళ్ళికొడుకు వదినె జీనత్‌ను నిలదీసింది— శోభనం గది ముందు.

జీనత్ పెళ్ళికొడుకు పేరు చెప్పినా— ''ఏదీ అసలు వినబడందే'' అంటూ మళ్ళీ మళ్ళీ చెప్పించింది. జీనత్ సిగ్గుతో కుంచించుకు పోయింది.

''ఈ వేషాలన్నీ నా దగ్గిర సాగవ్! ఇంకా బిగ్గరగా చెప్పాలి'' అంటూ వేధించి దాదాపు జీనత్ కళ్ళనీళ్ళ పర్యంతరమయ్యేట్టు చేసింది, ఖాతూన్ బీబి

ఆమె మరీ పీడించి పీడించి జీనత్ మీద కసిగా ప్రవర్తిస్తుంటే— షరీఫ్‌కే బాధవేసి ''ఇక చాల్లే వదినా! చెప్పిందిగా!'' అన్నాడు భార్యను సమర్థిస్తూ.

''అబ్బో అప్పుడే పెళ్ళాన్ని వెనకేసు కొస్తున్నావే! పిల్ల మొత్తానికి మా ఘటికురాలు!'' అంది మరో ముత్తయిదువు, ఎగతాళిగా.

''పద జీనత్!'' అన్నాడు షరీఫ్ తను ముందుకు అడుగు వేసి''

''అయ్యో! ఎడమకాలు ముందు వేయాలయ్యా గదిలో.'' అంది ఖాతున్ బీబి కంగారుగా, మరిదిని తప్పుపడుతూ.

''నా బదులు జీనత్ ఆపని చేస్తుందిలే! అయినా యింకా కుడి ఎడమ లేమిటీ! చాదస్తం కాకపోతే'' అన్నాడు షరీఫ్, అదంతా తేలిగ్గా కొట్టేస్తూ.

''నువ్వన్నా— బిస్మిల్లా— అంటూ కుడికాలు వేయమ్మా! మీ ఆయన మనకు ఎలాగూ అందడు'' అంది ఖాతున్ బీబి, తన ఆధిక్యత ఆ మాటల్లో ధ్వనించేట్టు.

(ఇంకా వుంది)

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## బ్రహ్మానందరెడ్డి రాజీనామా :—

రాజకీయ మహారథులు శ్రీ బ్రహ్మానందరెడ్డి అంచనాలు ఈసారి తారుమారు కావడం ఆశ్చర్యకరం. ఉచితానుచిత అడుగు వేయడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. ఆయన చూపు ఎంత సంవత్సరాలు ముందుంటుంది. అలాటివారి అంచనా ఇప్పుడు ఎన్నికలలో తారుమారు కావడం, ప్రజాదరం పూర్తిగా వుందనుకొన్నవారు ఎన్నికలలో పత్తా లేకుండా పోవడం— పార్టీకి కూడా వూరూ పేరూ లేని పరిస్థితి ఏర్పడడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది. ఈ పరిస్థితికి తానే కారణమని నమ్మినవారు గనుక ఆయన కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చారు. రాజీనామాను కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆమోదించింది కూడా. ఉభయ కాంగ్రెస్‌ల ఏకీకరణను కోరుతున్నవారు కాసువారి రాజీనామాను హర్షించారు కూడా. ఆంధ్ర, కర్నాటకలలో ఎన్నికలలో కాంగ్రెస్ పరాజయానికి తనదే పూర్తి బాధ్యత అని ఆయన అధిష్ఠాన వర్గానికి వ్రాసిన లేఖలో తెలిపారు. రాష్ట్ర కాంగ్రెస్ సంఘాధ్యక్షులు శ్రీ మహమ్మద్ రహమతుల్లా, ప్రధాన కార్యదర్శులు శ్రీ కె. రోశయ్య, శ్రీ ప్రగడకోటయ్య తమ పదవులకు రాజీనామా యిచ్చారు.

## మహావిజేత చెన్నారెడ్డి :—

ఎన్నికల కోలాహలం అణగింది. ఫిబ్రవరి 25వ తేదిన పోలింగు దృశ్యాలు చెప్పుకోదగినవే. శతవృద్ధులు, కుంటివారు, కబోదులు, పోలింగు కేంద్రాలకు ఇతరుల సాయంలో రావడం ఓటు వెయడం ఎప్పటి దృశ్యాలే. ఎన్నికల ఫలితాలు జంటనగరాలవారికి వెంటవెంటనే తెలియడానికి రాష్ట్ర ప్రభుత్వ సమాచార పౌర సంబంధ శాఖవారు సచివాలయంవద్ద పెండగిజాలమేర బోర్డులు పెట్టారు. ఫిబ్రవరి 27వ తేదీరాత్రి ఎన్నికల ఫలితాలు తెలుసుకొనడానికి సచివాలయం ముందు గుమిగూడిన జనం ఉత్సాహావేశాలు చెప్పనలవికాను. తెల్లవార్లూ జాగరణం చేశారు. పోసుల ముందు, రేడియో సెట్లముందు మూగిన జనానికి హద్దులేదు. ఈసారి ప్రజలు పెద్ద పెద్ద రాజకీయ పండితుల అంచనాలను పూర్తిగా తారుమారు చేశారు. జనతా, ఉభయ కాంగ్రెస్‌లకు చెరి ఎంత స్థానాలు రావచ్చునని అంచనా వేశారు. ఎన్నికల దైవజ్ఞులు. కాని, ఇందిరా ఝంఝామారుతం తక్కిన పార్టీలని వూడ్చి పారేసింది. ఈ ఘనవిజయానికి కారణ భూతులయిన రాష్ట్ర ఇందిరా గాంధీ కాంగ్రెస్ అధ్యక్షులు డాక్టర్ ఎం. చెన్నారెడ్డిని అభినందించక తప్పదు. ఆయన నిర్వహణ శక్తితో రాష్ట్ర విధాన సభస్థానాలు 294 లో ఇందిరా కాంగ్రెసుకు 175 స్థానాలు లభించాయి. తక్కిన పార్టీలు మెడ ఎత్తి చూచినా కనిపించనంత ఎత్తుకుపోయింది ఇందిరా కాంగ్రెస్. జనతాపార్టీకి 60 స్థానాలు, కాంగ్రెసుకు 30 స్థానాలు, మార్క్సిస్టులకు ఎనిమిది స్థానాలు, కమ్యూనిస్టు పార్టీకి ఆరు, మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్‌కు రెండు, మార్క్సిస్టు లెనినిస్టు పార్టీకి ఒకటి, స్వతంత్రులకు 12 స్థానాలు వచ్చాయి. తక్కిన పార్టీలన్నీ కలిపి 119 కాదంత డాక్టర్ చెన్నారెడ్డి పార్టీకి రోడ్డురోలరు మెజారిటీ వచ్చింది. తమ విజయాన్ని చూచి తామే విస్తుపోయేంత పరిస్థితి ఏర్పడింది ఇందిరా కాంగ్రెస్‌కు. పేదలు ఇందిరాగాంధిని తమ పాలిటి పెన్నిధిగా భావిస్తున్నంతవరకు, ఇతరపక్షాల వారు ప్రజల మనస్తత్వాన్ని తెలుసుకొనడంలో జాప్యం చేస్తున్నంతవరకు, ఎదురుకున్న వారికి ఎన్నికలపై ఉపేక్ష తొలగేంతవరకు ఇందిరా కాంగ్రెస్‌కు విజయం తప్పదు. ఇందిరా గాంధికి ఉత్తరాపథంలో పట్టు తప్పింది గనుక, ఇప్పుడు ఆంధ్ర కర్నాటకాలలో నిలవ దొక్కుకొనే అడ్డాలు ఏర్పడ్డాయి గనుక, కేంద్రంపై దాడికి సన్నాహాలు చేయగలదని, కేంద్ర ప్రభుత్వ ప్రతికూలోద్యమాలు ఈ రెండు రాష్ట్రాలలో చెలరేగితే ఆశ్చర్య పడవలసిన పనిలేదని రాజకీయ దైవజ్ఞులు అంటున్నారు. కాని, ఇప్పటికే దక్షిణాపథంలో కేరళ తమిళనాడులలోను, ఉత్తరాపథాన నాగాలాండ్, పశ్చిమ బెంగాల్‌లోను జనతేతర ప్రభుత్వాలు వుండగా రాని ఉద్యమాలు ఆంధ్ర కర్నాటకాలలో ఎందుకు వస్తాయని కొందరు రాజకీయజ్ఞులు అంటున్నారు.

## శాస్త్రజ్ఞులకు గవర్నర్ విజ్ఞప్తి :—

మూఢనమ్మకాలు మనస్సుకు సంబంధించినవి. ఇవి ఏ కాలంలోనైనా ఉంటాయి. ఎప్పటికప్పుడు కొందరు వీటిని తొలగించడానికి ప్రయత్నం చేస్తూనే వుంటారు. కాని, నేటిదాకా వూడలు పారిన ఈ అంధవిశ్వాసాలను తొలగించడం అంత సులభం కాదు. ప్రజలకు శాస్త్ర విజ్ఞానం తోడ్పాటు అనే విషయంపై ఫిబ్రవరి 28న రాష్ట్ర వైజ్ఞానిక శాస్త్ర అకాడెమీ ఏర్పాటుచేసిన సదస్సును ప్రారంభిస్తూ రాష్ట్ర గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ అన్నట్టు శాస్త్రజ్ఞులు మూఢ నమ్మకాలను తొలగించడంలో తోడ్పడాలి. ప్రొఫెసర్ నాయుడమ్మ అన్నట్టు మూఢ నమ్మకాలను తొలగించడానికి ఇదివరకు కొంత కృషి జరిగింది. కాని జరుగవలసింది చాలవుంది. ప్రజలజీవన విధానంలో విజ్ఞానశాస్త్రం ఎంత ఎంత మార్పు తేగలదని నాయుడమ్మ అన్నారు. ప్రొఫెసర్ సూరి భగవంతం ఒక మంచి మాట అన్నారు. వైజ్ఞానిక రంగం సిబ్బంది విషయంలో భారత దేశం ప్రపంచంలో మూడవస్థానం ఆక్రమించినా దారిద్ర్య నిర్మూలనంలో తగిన ప్రగతి సాధించలేక పోయిందన్నారు ఆయన. అధ్యక్షత వహించిన అకాడెమీ అధ్యక్షుడు ప్రొఫెసర్ వి. ఎస్. దాసుదేవ్ తమ అకాడెమీ చేసిన కృషిని వివరించారు.

## ఉపశ్రుతి : -

మూఢ విశ్వాసాలంటే ఏమిటండీ? అడిగారు ఒకరు నన్ను. నేను యోచిస్తున్నాను ఏమి సమాధానం ఇద్దామా అని. పక్కనున్న ఒక పెద్దమనిషి అన్నారు— నాకు ఇష్టం లేనివి మీకు మూఢ విశ్వాసాలు. మీకు ఇష్టం లేనివి నాకు మూఢ నమ్మకాలు అన్నారు.



# వారఫలం

మహేష్

**24-3-1978 శుక్రవారం మొదలు**
**30-3-1978 గురువారం వరకు**

**మేషం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో సాటివారి పోటి పెరుగు తుంది నూతలవ్యవహారాలు లాభిస్తాయి. ప్రయో జనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి దైవకార్యాలు నెరవేరతాయి

**వృషభం:—** విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది వినోదకాలక్షే పాల్లో పాల్గొంటారు.

**మిథునం:—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో సాహసిక వ్యవహా రాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభి స్తుంది అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కర్కాటకం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహా రాల్లో మొగమాటాలు తగవు వృత్తిలో నూతనావ కాశాలు లభిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభి స్తాయి.

**సింహం:—** రావలసిన డబ్బు అందుతుంది. ప్రయో జనంగల పరిచయాలు యేర్పడతాయి. వృత్తిలో సాటివారి పోటి తగ్గుతుంది రాజకీయ వ్యవహా రాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కన్య:—** వృత్తివ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు, బాగుంటాయి స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:—** చిరాకులకు గురి కాగలరు. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారంమధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహా రాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు:—** అధికారుల వలన జరగవలసిన వ్యవ హారాలు బాగుంటాయి. సజ్జనసాంగత్యం లభి స్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలి స్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడగలదు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం:—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్య మైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు స్త్రీలకు — ఆరో గ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొం టారు.

**కుంభం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఆందోళన కలుగుతుంది వారంమధ్యలో వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**మీనం:—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి వారం మధ్యలో ప్రయాస కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. అలంకారవస్తువులు కొంటారు. ●

---

ముసలమ్మగారి దగ్గరకు మంత్రాని కొచ్చే వారు ఆవేళే ఓ చిన్నసైజు యుద్ధం జరగడం వలన అభిమానం అడ్డొచ్చి అత్తగారు మంత్రం వేయించుకోలేదు మర్నాడు అవిడ సున్నం బెల్లం పట్టు వేసుకుంటూంటే నిప్పులు కురిపిస్తూ చూసేరు ముసలమ్మగారు ఆ రోజూ మంచందిగలేదు అత్తగారు మర్నాడు పొద్దున్న ఇంటి పనులన్నీ తనే చేస్తూ ముసలమ్మగారు "నేను మంత్రం వెయ్యకుండా ఈ ఊళ్లో ఎవరికైనా కాలినొప్పి తగ్గిందిటే! నీ లాంటిదే చెరువుమీద కోపంవచ్చి స్నానం చేయడం మానివేసిందిట! నేను వండిపెడితే తింటున్నావు నన్ను మంత్రం వెయ్యమన డానికి మొహం చెల్లలేదేం! మంచం దిగేక సాధిద్దువుగాని కాలిటు పెట్టు! మంత్రం వేస్తాను" అంట్లూ అత్తగారు ముఖం

## శత్రుబంధం

(18వ పేజీ తరువాయి)

అటు తిప్పుకొని ఉండగానే రెండు గడ్డి పరకలు తీసుకొచ్చి మంత్రంవేసి వెళ్లి పోయారు. సాయంత్రానికి కొంచెం కాళీ డుస్తూ నడిచేరు అత్తగారు.

ఏడాది క్రితం నేనోసారి వచ్చినప్పుడు మా అత్తగారింట్లో అటుకులవడ్లు పోసేరు అప్పటికి ముసలమ్మగారి కాలిమీద వేడి వేడి నూనెపడి కదలకుండా చేసింది. "నాకో పది రోజుల్లో తగ్గుతుంది తరువాత పొద్దువు గానిలేవే" అన్నారావిడ. అత్తగారు వినిపించు కోలేదు. అంతేకాక ముసలమ్మగారు ఓచోట కూర్చోక పనిలోకివస్తే ఒక్క అటుకుగింజ ముట్టుకోనన్నారు. అత్తగారి ధైర్యం నాకు ఆశ్చర్యమనిపించింది. ముసలమ్మగారు పట్టు లేక కూర్చున్న చోటినుంచే "సోమయాజులు గారి శేషప్ప వచ్చిందా! నీలకంఠంగారి రాజమ్మ వచ్చిందా?" అంటూ ప్రశ్నలు మొదలుపెట్టేరు. అత్తగారుఅందుకున్నారు. "వాళ్లెందుకొస్తారు! మీ యింటి కొచ్చేను నాకేం పెడతావు? మాయింటికొచ్చేవు నాకేం తెచ్చేవు? అనే మనుషులువాళ్ళు అయినా పిలి చినా పిలవకపోయినా వెళ్ళి వళ్ళంతాగుల్ల చేసు కునేందుకు వాళ్ళు మీ లాంటి వెర్రివాళ్ళు కాదు! వాళ్ళ ఇళ్లకి అడ్డమైన పనికి వెళ్లద్దండీ అంటే ఎప్పుడైనా విన్నారా? మనం చేసిన ఉపకారం వాళ్లు గుర్తుపెట్టు కున్నారా లేదా అన్నది అక్కర్లేదు. అన్నిం టికీ నే నున్నానంటూ తయారు! మీ చేతి రోకలిపోటు పడకుండా ఊళ్లో ఎవరైనా అటుకుల వడ్లు పోసుకున్నారా! ఆ రోజు నాతో దెబ్బలాడి కోపంవచ్చి అన్నం తినడం

మానేసి వదని కాళ్ళూ కడుపూ పట్టుకొని (ఒతిమాలుతూన్నా వినకుండా నీలకంఠం గారింటికెళ్లి మిరాయి వండేరు. ఎనభై ఏళ్ళు దాటాయి నీకు చేతులు పట్టులేవు తల్లీ అంటే వినిపించుకున్నారా! అంత మూకుడూ దించుతూ నూనె కాలి మీద వంచుకున్నారు. మంచం పట్టి బాధపడు తున్నదెవరు... శేషమ్మగారింట్లో తద్దినం వచ్చినప్పుడు... విప్పుడూ మంచం మీద పడుక్కుంటే పిచ్చెక్కి నట్లుంటుందని ఓ సారలా దత్తుడు గారింటికి వెళ్ళొస్తానని తద్దినం వంట చెయ్యడాని కెళ్లేరు. కాలి

మీద కాలి వచ్చిన నీటి బుగ్గలు లవలవలాడు తూంటే అసహ్యించు కుంటారనే జ్ఞాన మైనా ఉండాలి. నీళ్లు నిండిన మనిషి తను తెలుసుకోవాలేగాని ఎవరు మాత్రం ఎన్నాళ్ళు చెప్పగలరు. ఇంలా చేస్తే ఎవరికి కృతజ్ఞత! ఓడ దాటేదాక ఓడ మల్లన్న ఓడ దాటేక బోడి మల్లన్న!'' అంటూ అత్తగారు మనసులో ఉన్న బాధనంత వెళ్ల బోసుకున్నారు

ముసలమ్మగారు పోవడానికి మూడు నెలల ముందు ఆ వూళ్లో ఒకప్పుడు బాగుండి చితికిపోయిన సూరయ్యగారమ్మా యికి పెళ్ళి కుదిరితేనూ ముసలమ్మగారు ''మా వాడినో బస్తా బియ్యం ఇమ్మంటాలే!'' అన్నారుట. ఆ విషయం తెలియక పెళ్లి కుదిరిందని తెలిసి వాళ్ళంటే ఉన్న గౌరవంకొద్దీ అత్తగారు పెళ్లి నాలుగు రోజులుండగా ఓ బస్తా బియ్యం, రెండు కుంచాల కందిపప్పు, ఓ ఇరవై రూపాయలూ పంపించేరుట. అవి ఇంట్లోంచి తీసుకెడు తూంటే ఎదురొచ్చిన ముసలమ్మగారు అగ్గి మీద గుగ్గిలం అయిపోయారట!

'ఔరా! నే నిస్తానన్న మాట తెలిసి తన పేరు నిలవాలని మరో రెండు కుంచాల కందిపప్పు. డబ్బూ ఇచ్చి ఇల్లంతా గుల్ల చేస్తుందా! ఇంట్లో పెద్దముండ ఒకత్తె ఉచ్చిందని మర్యాదకైనా ఓ మాట అన కూడదా!'' అంటూ ముసలమ్మగారు ... నా పిల్లలూ పిల్లల పిల్లలూ ఇలా పుస్తె కట్టించుకొని అత్తపోరు లేకుండా పట్న వాసాలు పోయి కాపురాలు చేసుకుంటు న్నారు. నాకు చచ్చే యీడు వచ్చింది కాని పూచికపుల్ల కదిల్చే పెత్తనం తగులడ లేదు.'' అని అత్తగారూ అరుస్తూంటే ''అబ్బబ్బ! నోరు మూసుకోండి; రోజా ఒకపెగోల చంపేస్తున్నారు!'' అన్నారట మామగారు.

''అపుచురా! నన్నునోరు మూసుకోమనే అంటావురా! అందరికీ కన్నపిల్లలు కట్నాలూ కానుకలూ లెస్తూంటే (అప్పటికి పది రోజుల క్రితం మా వారు అత్తగారికిపంపిన చీరకిలంకె) నాకొడుకు నన్ను నోరుమూసు కోమంటున్నాడు వాళ్ళేనపసూసాలూ మోసి కన్నారు! నా కెంపట్టిందని నేను కన్నాను! నేను ఎల్లిని కాదురా! రాక్షసిని--ఇదె! నీ యిష్టం వచ్చినట్లను!'' రెండు రోజులు

# శత్రుబంధం

ముసలమ్మగారు అసలు పొయ్యిలో నిప్పు వెయ్యలేదు అత్తగారి కళ్ళు ఆ రెండు రోజులూ పొడారలేదు.

సూరయ్య గారింట్లో ఘనంగా పెళ్ళి జరిగిపోయింది. ముసలమ్మగారు పెళ్ళి వంటకూ వెళ్లలేదు అత్తగారు భోజనానికి వెళ్ళలేదు. వాళ్ళకే మనసు చెల్లక అన్నీ ఇక్కడికే తీసుకొచ్చి కాళావేళ్ళాపడి బతిమాలి ఇద్దరి చేతా తినిపించేరు. ఇద్దరి శత్రుత్వం పెళ్ళిపందిట్లో విస్తరిలోపదార్థాలతో పాటు అందరికీ వడ్డించబడింది.

మూడునెలల తర్వాత ముసలమ్మగారు ఎవరింట్లోనో అరిసెలు వండి వచ్చేరుట. ఆలస్యం అయిపోయిందని అన్నం తినకుండా వాళ్ళునేమానిచ్చిన నాలుగు అరిసెలేతినేసి చెంబుడుమంచినీళ్ళుతాగి కళ్ళుతిరుగుతున్నా




యంటూ పడుకున్నారుట సాయంత్రం అత్తగారు శ్రావణమంగళవారం పేరంటా నికి వెళ్ళబోతూంటే ''ఏమేవ్! నాకు ఒళ్ళు తిరుగుతూంది. అలా పెరట్లో మంచం వెయ్యి! అక్కడ పడుక్కుంటాను. ప్రాణం పోతే ఇల్లు మైలబడుతుంది.'' అన్నారుట.

''చాల్లెండి ఉపద్రవం మాటలు! ఎప్పుడైనా నింపేనప్పుడారు! మీ ప్రాణంకంటే మాకు ఇల్లేమీ ఎక్కువ కాదు! నాచేత ఎలాగో మంచం అక్కడ వేయించి ఇంకా ఊరంతా యాగీ చెయ్యడానికి--'' అత్తగారు పేరంటానికి వెళ్ళి పోయారు

తిరిగి వచ్చేసరికి మంచాన్నితోసుకుంటూ డేక్కుంటూ ముసలావిడ పెరటి సానిట్లోకి వెదుకుతున్నారు అత్తగారు నెత్తి నోరూ మొత్తుకొని ఊరందర్నీ పోగుచేసు కొచ్చారు. అప్పటికే ముస లమ్మగారి మాట పడిపోయింది. ఆ తరువాత మూడు రోజులు మంచం మీద ఉన్నారు. అత్తగారు వెడిలే మాత్రం తల పక్కకు తిప్పుకొనేవారట. అత్తగారువేతో మందు పోస్తే గుటక వెయ్యకుండా గుడ్లప్పగించి చూసేవారుట ఇన్నాళ్ళూ ఈవిడ కింతచాకిరీ చేస్తే చూడండి నేను పోసిన మందు కూడా విషంకంటే ఎక్కువయి పోయింది. పసి పిల్లలాగుటకెయ్య కుండా ఎలా చూస్తోందో చూడండని వాపోతూ అత్తగారు గుడ్లనీళ్ళు కుక్కుకున్నారుట.

మర్నాడుఉదయం ముసలమ్మగారుపక్కకి చూపిస్తూ ఏదో సైగ చేశారుట. అత్తగారికి అర్థం కావేదు. వీదిలో కెళ్ళి ఇద్దరు ముగ్గుర్ని తీసుకొచ్చేసరికి ముసలమ్మగారు మంచం మీదలేరు. ఏడడుగుల దూరంలో ఉన్నబాల్చీలో నీళ్ళు నెత్తిమీద గుమ్మరించు కుని ఆయాసంతో రొప్పుతున్నారట. నలుగురూ మోసుకెళ్ళి మళ్ళీ మంచం మీద పడుకోబెట్టేరు. ''మందు పోస్తానుండండి. పొద్దున్నమందు తాగలేదు ''అని అత్తగారు సీసాతీసుకొచ్చేసరికి మళ్ళీ తలతిప్పుకున్నారు.

వెంటనే బాధగా ఏలకదల్చబోయారు. గుడ్లు పెద్దవయ్యేయి నోరు తెరచి నాలుక బయటకు చాచబోతే లోపలకు వంగి పోయింది,

''అలా చూడక తల్లోయ్! నాకు భయ్యం వేస్తూంది '' అని అరిచేరు అత్తగారు.

ముసలమ్మ రి ో చలనం లేదు. అంతా అయిపోయింది దరి పొడుక్కు నాకిదేధ్యాం అయింది

నేను రిక్షాదిగి లోపల కెళ్ళేసరికి మా చిన్నాడపడుచుగారు పెద్దమ్మాయి వాకిట్లో మంచంపగ్గర కూర్చుంది!

నన్ను చూడగానే ''అమ్మమ్మోయ్! చిన్నత్తవచ్చింది'' అంది మంచంమీదికి చూస్తూ.

సామాన్లు పక్కకిపెట్టి తొందరగా లోపలకు వెళ్లేను. పిల్లలిద్దరూ పరిగెత్తు కొచ్చి మంచంచుట్టూ మూగేరు.

నా కళ్లను నేను నమ్మలేకపోయాను.

అత్తగారు సగమైపోయేరు. అప్పుడే ముఖం కడుక్కున్నట్లున్నారు కట్టుడు పళ్లు కూడా తీసి పక్కకు పెట్టేసరికి పదిరోజుల్లోనూ మరో ముప్ఫై సంవత్స రాల వయస్సు శరీరంమీద పులుముకున్నట్లు న్నారు. నీరసంగా నావైపు. చూసి కళ్లతోనే పలుకరించి పిల్లలిద్దర్నీ చెరో చెయ్యి చాపి నిమిరేరు.

''ఇలా అయిపోయేరేమిటి అత్తయ్యా!''

# శత్రు బంధం

అన్నాను మంచంమీదే పక్కగా కూర్చుంటూ.

మెల్లగా పళ్ళు తీసి నోట్లో పెట్టుకొని దానికే అలసిపోయి బాధగా మూల్గేరు.

"ఏముందమ్మా! ముసలమ్మే పడు కుంటాను. బ్రతికి సాధించింది చచ్చికూడా సాధిస్తోంది" అన్నారు నీరసంగా.

నాకేమీ అర్థం కాలేదు. తరువాత మెల్లగా అత్తగారు చెప్పేరు.

"కర్మలయ్యేదాకా నలుగురూ ఉన్నారు నాకేమీ అనిపించలేదు. నలుగురూ వెళ్ళేక లంకంత కొంపా బావురుమంది. నే నొక్క ర్తెనూ ఉండలేకపోయేను. ఉద్దండ పిండం ఆవిడ లేకపోతే నేనుండగలనా! వంటింట్లో కెడితే ఆవిడ...నూతిదగ్గర కెడితే ఆవిడ... ఊరగాయల గదిలోకెడితే ఆవిడ... మడి బట్ట ఆరేసుకుంటుంటే ఆవిడ. ఇంట్లో ఏ గిన్నె చూసినా ఏ చిలక్కొయ్య చూసినా ఇంటికి ఎవరొచ్చినా ఆవిడే గుర్తుకొస్తోంది ఏ పక్కనుంచో వస్తూ నన్ను తిడుతూ న్నట్లే ఉంటుంది... వంట చేసేటప్పుడో వడ్డించేటప్పుడో ఎక్కడ అంటుబట్ట తగులుతుందోనని ఆవిడ చూస్తున్నట్లుగానే ఉంటుంది..." అని ఆవిడ చెప్తూంటే అడుగుల చప్పుడయి అత్తగారు చెప్పడం ఆపేరు.

నేను తల తిప్పి చూసేను.

మా అత్తగారి రెండో తమ్ముడు. అప్పుడు ముసలమ్మగారు పోయినప్పుడు ఉత్తరాదివైపు ఏవో పండితుల సభలకు వెళ్ళేరన్నారు పరాసుక్కి వచ్చినట్లున్నారు ఇన్నాళ్ళా అత్తగారిని పీడించిన శక్తి అదృశ్యమయినట్లు ఆయన నోటి చివర సన్నగా చిరునవ్వు మెరుస్తోంది. నేను లేచి నిలబడ్డాను.

"ఎవరదీ?" అన్నారు అత్తగారు.

"మీ తమ్ముడండీ" అన్నానేను.

"చివరకి పాపం ముసలావిడ పోయిం దిటే!" అన్నారాయన.

ఏదో ఆచారానికి మాట్లాడిన ఆయన మాట వెనుక ఒక రకమయిన తేలిపి స్పష్టంగా కనబడుతూంది.

మంచానికి కొంచెం దూరంగా ఉన్న ఎత్తుపీట ఒకటి ఆయన కూర్చుంటారని దగ్గరగా లాగేను. ఆయన మంచంమీదనున్న అత్తగారిని నమ్మలేనట్లుగా చూసేరు.

"ఇలా అయిపోయేవేమిటే!" అన్నా రాయన కూర్చుంటూ.

నేను అత్తగారివైపు చూసేను ఉప్పె నలా వచ్చిన దుఃఖంతో ఆవిడ ఊగి పోతు న్నారు. కళ్ళల్లోంచి ఒలకపోసినట్లు కన్నీళ్ళు కారిపోతున్నాయి. ఒక్కసారి పెద్దగా బేరు మన్నారు

"మా ముసలావిడ నన్నిలా దిక్కులేని దాన్ని చేసి వెళ్ళిపోయిందిరా! కృష్ణుడు వెళ్ళి పోయినప్పుడు అర్జునుడి శక్తి పంతా లాక్కొని పోయేడని ఆవిడ చెప్తూండేవారు. ఆవిడ నా శక్తంతా లాదుకు పోయిందిరా! ఈ కొంపలో ఆవిడ లేకుండా ఒక్క క్షణం బ్రతకలేనురా!" అన్నారు

ఆయన తెల్లబోయారు. నేను ఆశ్చర్య పోయేను.

ముసలావిడ బ్రతికి ఉన్నన్నాళ్ళా ఆవిడ పోరుతో ఊపిరి సలుపని అత్తగారు ఆవిడ లేరని అధైర్యపడడం... ఇదెక్కడ విచిత్ర మైన బంధమో అర్థం కాలేదు. కాని ఈ బాధ నిజంగా ఆవిడ మనసులోంచి పొంగి వస్తూంది. ఆ సత్యాన్ని నేను స్పష్టంగా చూడగలుగుతున్నాను

మరో రెండు మూడు గంటలకు కొంచెం ఉపశమించింది అత్తగారికి.

"నాలుగు రోజుల్లో ఆవిడ మాసికం వస్తోంది. నేను చూస్తే ఇలా ఉన్నాను. ఏంలోటు వస్తుందోనని భయంతో వెంట్రగాం ఇచ్చి అయినా నిన్ను రప్పించ మన్నాను." అన్నారు అత్తగారు

మాసికానికి నిజంగా ఎక్కడ లోటు వస్తుందోనన్నట్లు ఆ నాలుగు రోజుల్లోనూ పగానికిపైగా కోలుకున్నారు అత్తగారు. రెండు రోజులు ముందు నుంచీ కాస్త మంచందిగి తిరుగుతున్నారు.

మాసికంరోజు ఎంత వద్దన్నా వినిపించు కోకుండా పంటికి స్నానంచేసి మడిబట్ట కట్టుకున్నారు. ఆవిడ పరిస్థితి చూసి నేను కూడా మడిబట్ట కట్టుకుంటానంటే మీ బస్తీవాళ్ల ఆచారాలు ఆవిడకి పడవు పద్దన్నారు. అయినా వినిపించుకోక స్నానం చేసి వచ్చేను. ఇంతలో మా రెండోవాడు నీళ్ళు కావాలంటే మరచిపోయి చెంబుతో నీళ్ళు చేతికి అందించేనుట! అదీ నేను గమనించనేలేదు. తరువాత మిగిలిన

మినప్పప్పు రుబ్బుదామని రుబ్బురోలు దగ్గర కెళ్ళేసరికి అత్తగారి కేకవిని హడలిపోయేను

"అదేమిటే! అంటు నీళ్ళు ముట్టుకొని రుబ్బురోలు ముట్టుకుంటున్నావ్! ఇంకా నయం తగలేదు. నువ్వుండు. నేను రుబ్బుతాలే! ఈ మడి ఆవిడకి కిట్టదు. ఓ దారమ్ముక్క తొక్కేననో ఏ చంటి వెధవో తగిలేడని అనుమానంగా ఉందనో అంట నీళ్ళు తొక్కేననో రోజు వందసార్లు స్నానం చేస్తేగాని ఆవిడకి సంతృప్తి ఉండేదికాదు, పచ్చడిచేస్తే రుబ్బురోలు చిల్లుల్లోదూరిం దని అంటు పోవాలని కాకర పువ్వొత్తుల తీగలతో గంటన్నరసేపు దాన్ని కుట్టి కడుగుతేగాని ఆ పచ్చడి వేసుకు తినేవారు కాదు. ఆవిడకు ఇలాచేస్తే 'ముట్టదు కూడాను" అంటూ అంతపనీ ఆవిడే చేసుకున్నారు. ముసలావిడ కేవేవి ఇష్టమో ఎలా ఇష్టమో చెప్తూ దగ్గరుండి అన్నీ తయారు చేయించేరు.

చివరకు మాసికం మంత్రాలయ్యేయి.

మామగారు అరటాకులో పిండంపెట్టి కూర్చున్నారు. పెరట్లో నూతిపక్కన చింతచెట్టుమీద కాకి ఈ కొమ్మ మీద నుంచి ఆ కొమ్మ మీదకీ ఆ కొమ్మ మీద నుంచి ఈ కొమ్మమీదకీ అక్కడి నుంచి నూతిమీదకీ దాని మీద నుంచి పక్క కొబ్బరి చెట్టు మీదకీ దూకుతుందే కాని పిండం ముట్టుకోవటంలేదు.

అత్తగారు అయిదు నిముషాలకోసారి దొడ్లోకెళ్ళి చూస్తూనే ఉన్నారు.

"నీ కేలోటూ చెయ్యలేదమ్మా! రోగం వచ్చినదాన్ని స్నానంచేసి మడి కట్టుకుని వండేను" అని అత్తగారు మనిషిలో చెప్పి నట్టు చెప్తూనే ఉన్నారు.

ఎండ నడినెత్తి కొచ్చేసింది. మామగారు అసలే పొద్దున్న ఏమీ తినలేదేమో నీరసంగా నూతికి జార్లబడి కూర్చున్నారు. తోటకూర కాడలా వ్రేలాడిపోయిన ఆయనను చూసి విస్తట్లో పిండాన్ని చూసేసరికి అత్తగారికి అరికాలిమంట నెత్తికెక్కినట్లుంది.

"నీకేం లోటు చేసేనమ్మా ఈమంకు పట్టు! తెల్లారకట్ల రెండు గంటలకు లేచి రెక్కలు ముక్కలు చేసుకుని వంటలన్నీ చేయించేను. ఇప్పటికి పదిసార్లు స్నానం చేసేను. అప్పుడు కట్టిన తడిబట్ట ఇప్పటి దాకా విప్పలేదు. గోదానం ఇచ్చేం. బ్రాహ్మణులకి మువ్వనుకొనేదానికంటే ఎక్కువే ముట్టజెప్పేం. వళ్ళంతా ఇల్లంతా గుల్ల చేసుకున్నాం! పట్టిన పట్టుకు విడుపుండాలి ఇంత మంచి చెడ్డా ఉండక్కర్లేదూ!... ఇంతకీ ఏం తక్కువైందని ఈ నీలగడం... ఎందు కెందుకని చూస్తుంటేనూ..." ఒక్కసారి విజృంభించేరు తారస్థాయిలో.

చింతచెట్టుమీద చిటారు కొమ్మమీద కెగిరిన కాకి బాణంలా దూసుకొచ్చి విస్తరి మీద వారి కసుక్కున పిండాన్ని పొడిచింది.

నా కనిపించింది, అపటిదాకా చేసిన నాటకాలన్నింటిలో అత్తగారి సాధింపు ఒకటే లోటొచ్చిందేమో అది కూడా కలిసే వరకూ ముసలావిడకు ఏమీ రుచించలేదేమోనని.

# అంతరిక్షం నుండి ఆరోగ్య సౌభాగ్యం

—ఆర్. రామకృష్ణారావు

శీర్షికనుబట్టి ఇదేదో 'మంత్ర తంత్ర మాయాజాల చిత్ర విచిత్ర జానపద పౌరాణిక కథ' అయివుంటుంది అని మీరు కంగారు పడుతున్నారు కదూ? పడకండి! అమెరికా వంటి సంపన్న దేశాలు ఎన్నో కోట్ల రూపాయల వ్యయంతో 'అంతరిక్ష పరిశోధనలు, జరుపుతున్నాయనీ, మనుషులు లేని 'రోదసీ నౌకలు' కొన్ని. మనుష్యులతో వున్న రోదసీనౌకలు మరికొన్ని అంతరిక్షంలో విహారాలు చేస్తున్నాయనీ మనందరికీ తెలుసు! ఇదంతా దండగమారి పని అని కొందరు ఘనుల నిశ్చితాభిప్రాయం! వారి అభిప్రాయం తప్పు అనీ, ఈ వ్యాసం చదివాక మీకు తప్పక అనిపిస్తుంది.

అంతరిక్ష పరిశోధనల్లో కనుగొన్న కొన్ని వైజ్ఞానిక ఫలితాలు వివిధరంగాల్లో ఉపయోగపడుతున్నాయి. అయితే ఆరోగ్య, వైద్య రంగాలకు మాత్రం ఈ పరిశోధనల వలన ఎనలేని మేలు చేకూరిందని నిరభ్యంతరంగా అనుకోవచ్చు! ఈ రంగంలో కలిగిన కొన్ని లాభాలు ఏమిటో ఇప్పుడు తెలుసుకుందాము.

అంతరిక్ష యాత్రికుల హృదయ స్పందనలను (హార్ట్–బీట్స్) భూమి మీదకు ప్రసారం చేయడానికి స్ప్రే–ఆన్ ఎలక్ట్రోడులు అనే పరికరాలను ఉపయోగించేవారు. ఈ 'ఎలక్ట్రోడ్'లను 'ఎస్ట్రోనాటు'ల ఛాతీపై అమర్చేవారు. ఈ పరికరం గంటల తరబడి





వ్యోమ విహారుల ఛాతికి అంటుకొని వుండటానికి వీలుగా ఒక జిగురు – పదార్థాన్ని (ఎడెసివ్), ఆ పదార్థాన్ని చల్లడానికి ఒక ప్రత్యేకమైన సాధనాన్ని (స్ప్రే–గన్) 'నాసా' శాస్త్రజ్ఞులు రూపొందించారు.

1960 తరువాత 'కాలిఫోర్నియా'లోని ఓ ఆసుపత్రికి చెందిన 'యాంబులెన్సు' – కారులలో ఇలాంటి సాధనాల్ని ప్రవేశపెట్టారు! గుండెపోటుతో బాధపడే వ్యక్తిని ఆసుపత్రికి 'యాంబులెన్స్'లో తీసుకువెళ్ళే సమయంలోనే (అంటే దారిలోనే)రోగి గుండె పరిస్థితిని ఎప్పటి కప్పుడు హాస్పిటల్‌కు అందజేయడానికి వీలయిందన్నమాట. యాంబులెన్స్– వాను ఆస్పత్రికి చేరేసమయానికి అక్కడి డాక్టర్లకి రోగి పరిస్థితి సవిస్తరంగా తెలిసిపోతుంది. అత్యవసరమైన పక్షంలో క్షణాల మీద డాక్టర్లు రోగికి అవసరమైన చికిత్స చేయడం వీలవుతుంది.

మారుమూల పల్లె ప్రాంతాలల్లో వున్న ప్రజలకు అధునాతన వైద్య సౌకర్యం అందుబాటులో వుండదు. ఎందుకంటే పెద్ద ఆసుపత్రులన్నీ సాధారణంగా పట్టణాల్లోనే వుంటాయి. అంటే ఈ ప్రజలు దాదాపు రోదసీ యాత్రికుల పరిస్థితిలోనే వున్నట్లు (వైద్య సదుపాయం విషయంలోనే సుమండీ!) అనుకోవచ్చు.

అంతరిక్ష ప్రయోగాల్లో కనుగొనబడిన చక్కటి సదుపాయాలు ఈ పల్లె ప్రజలకు అందేయడానికి 'స్టార్ పాక్' అనే పద్ధతి రూపొందించబడింది. ప్రస్తుతం దక్షిణ అరిజోనా (అమెరికా) లోని పపాగో ప్రాంతంలో ఈ 'స్టార్ పాక్' పట్టణాల్లోని వైద్య సదుపాయాన్ని పల్లె ప్రజానీకానికి అందచేయడానికి కృషి చేస్తున్నది.

ఎలాగ? ఈ 'స్టార్ పాక్' కథ కమామిషా ఏమిటి? ఒక మోటారు శకటంలో వైద్య సౌకర్యాలన్నీ అమర్చుతారు. ఈ 'వాన్'లో డాక్టర్లెవరూ ప్రత్యేకంగా ఉండరు, పల్లె ప్రజల్లోనే కొందరికి శిక్షణ ఇచ్చి వీటిలో నియమించుతారు. ఈ సుశిక్షితులైన వ్యక్తులు రోగులను పరీక్ష చేస్తారు, ఈ పరీక్షలు అన్నీ టెలివిజన్ కెమెరాద్వారా సుదూర ప్రాంతాల్లోని పెద్ద హాస్పిటల్లో, అరి పెద్ద డాక్టర్లు వివరంగా చూడగలరు. ఉదాహరణకు ఒక రోగి గొంతు నొప్పితో బాధ పడుతున్నాడనుకొందాము ఒక ప్రత్యేకమైన సూక్ష్మదర్శిని గొంతు లోపలి భాగాన్ని పరిశీలిస్తుంది. ఈ సూక్ష్మదర్శిని నుండి టి.వి కెమేరాకు తద్వారా పెద్ద ఆస్పత్రికి వ్యాధి పరిస్థితి అర్థమైపోతుందన్నమాట!

గమ్మత్తేమిటంటే ఈ 'స్టార్ పాక్' పద్ధతి ఇదివరలో జరిగిన అంతరిక్షయాన ఫలితాల నుండి రూపొందించ బడింది అని చెప్పడంకన్నా, భవిష్యత్తులో జరిగే గ్రహాంతరయానం దృష్టిలో వుంచుకొని రూపొందించబడింది అని అనుకోవడమే సబబు! ఎందుకంటే గ్రహాంతరయానానికి సంవత్సరాలతరబడి పట్టవచ్చు అలాంటప్పుడు రోదసీ నౌకల్లోని యాత్రికులకు భూమిపై వైద్యం చేయవలసి వుంటుంది కదా!

అంతరిక్ష పరిశోధనల్లో వెలువడిన మరో మంచి కిటుకును వుపయోగించి కృత్రిమంగా గుండె-కొట్టుకోవడాన్ని అదుపులో వుంచే సరికొత్త సాధనాన్ని రూపొందించారు (కార్డియాక్–పేస్ మేకర్). దీనిని అతి సులువుగా 'రీ ఛార్జి' (తిరిగి శక్తిని ఇవ్వడం) చేసే వీలుంది. రోగి కొద్దిసేపు ఒక చిన్న పరికరంలోని ఒక భాగాన్ని

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఈనాటి వనితాలోకం

## కొత్త ప్రత్యేక శీర్షిక

అన్ని రంగాలలోను తమ ప్రతిపత్తిని నిలుపుకుంటున్న ఈనాటి మహిళాలోకం పోకడలను అద్దంపట్టే వ్యాసాలను వారం వారం సచిత్ర వారపత్రికలో వెయ్యాలనుకుంటున్నాము. ఈ శీర్షిక క్రింద ప్రచురితమైన ప్రతి రచనకి రూ. 30 లు పారితోషికం యిస్తాము.]

శీర్షికలో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు.

* వ్యాసం సచిత్ర వారపత్రికలో రెండు కాలమ్‌ల నిడివికి మించరాదు : అంటే సుమారు వెయ్యి నుంచి పదునాలుగు వందల అక్షరాలు ఉండాలి. కాగితానికి ఒకవైపే సిరాలో విడివిడిగా వ్రాయాలి
* తమ ఫోటోలు పంపదలచుకున్న రచయితలు యితరుల తీయించుకున్న వాటిని పంపవచ్చు. ప్రచురణకి స్వీకరించబడని రచన, ఫోటోలని త్రిప్పి పంపేందుకు స్వంత చిరునామాగల తగు మాత్రం తపాలా బిళ్ళలు అంటించిన కవరు జతపరచాలి. అయితే ఫోటో, రచనలని త్రిప్పి పంపడం విషయంలో శ్రద్ధ తీసుకోబడుతుంది కాని బాధ్యత స్వీకరింప బడదు.
* ఈ శీర్షిక కేవలం వనితాలోకం అభివ్యక్తి వర్చావేదిక మాత్రమేగాని పోటి గాదు కనుక ముగింపు తేదీ లేదు.
* వ్యాసం ఎంపిక విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు

[మీ రచనలు కవరుమీద ఈనాటి వనితాలోకం శీర్షికకు అని వ్రాసి ఎడిటర్, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–3 అన్న చిరునామాకి టపాలో పంపాలి. వ్యక్తులపేర రచనలు పంపకూడదు.]

**ఈ శీర్షికలో వనితలు విరివిగా పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తాము.** సం॥

పట్టుకోవడము ద్వారా ఈ సాధనం రీఛార్జి అవుతుంది! పాత పద్ధతి 'కార్డియాక్–పేస్ మేకరుల'లో వుండే చిక్కులు అంటే రోగి ఛాతీనుండి బయటికి వచ్చే వైర్లు (లీడ్స్) వగైరా గందరగోళం ఈ కొత్త పరికరంలో వుండవు. ఈ సాధనము అమర్చాక 10, 20 సంవత్సరాల వరకు తిరిగి

# అంతరిక్షం నుండి ఆరోగ్య సౌభాగ్యం

శస్త్రచికిత్సతో అవసరం వుండనే వుండదు!

'కార్డియాక్-సోనార్' అనే పద్ధతిలో అంతరిక్ష యాత్రికుల గుండె కొట్టుకోవడాన్ని, ఎక్కువ ఫ్రీక్వెన్సీ కలిగిన ప్రకంపనాల ద్వారా ప్రతిఫలింపజేసి పరీక్షచేసేవారు. ఈ పద్ధతితో రోగికి నొప్పి కలుగకుండా హృదయ పరీక్ష చేయవచ్చు. ఇదివరకు రక్తనాళాలద్వారా ఒక రకమైన రంగు (డై) పంపి, ఎక్స్‌రేలు తీసి నానా అవస్థ పెట్టేవారు! ముఖ్యంగా శిశువులకు ఈ కొత్త పద్ధతి క్షేమకరం !

అంతరిక్ష నౌకల్లో అమర్చిన కెమెరాలతో తీసిన ఫొటోలను భూమిపై కంప్యూటర్లను వుపయోగించి చక్కబరచే విధానం ఆధారంగా శరీరభాగాలను అల్ట్రాసోనిక్, ఎక్స్–రేల సాయంతో చక్కటి ఫొటోలు తీసే పద్ధతులు రూపొందించారు.

వ్యోమ నౌకలపై అమర్చిన సౌరశక్తి–సెల్స్ పద్ధతిలో సౌర– ఎక్స్‌రే– సెన్సార్' లను నిర్మించారు. ఎక్స్‌రే తీవ్రత తగినంత మోతాదులో లభించగానే ప్రసార యంత్రం దానంతట అదే ఆగిపోతుంది ! 'బ్రెస్ట్ – కాన్సర్' చికిత్సలో ఈ పరికరం ఎంతో ఉపయోగకరం.

'రక్తపరీక్ష' చేయడానికి ఒక కొత్త విధానం, రోదసీ పరిశోధనల సందర్భంలోనే రూపొందించారు. మామూలు విధానంలో ఈ పరీక్షకు అరగంటవరకూ పడితే ఈ నవ్య పద్ధతిలో అరనిమిషంచాలు ! అలాగే ఇతర పరీక్షలు కూడా అతిత్వరగా చేయడం సాధ్యపడింది.

డాక్టర్లు పట్టుకు తిరిగే తోలుసంచుల స్థానంలో త్వరలో చిన్నచిన్న అల్యూమినియం పెట్టెలు రావచ్చు! తేలికైన ఈ చిన్న పెట్టెలో. బాటరీతో నడిచే 'రోగ లక్షణాల నిర్ధారణ' సాధనం, గుండెపోటు, మెదడు పరిస్థితి రికార్డు చేసే 'టేప్– రికార్డరు వంటి సాధనం. శస్త్రచికిత్స పరికరాలు వగయిరా అన్నీ ఇమిడిపోతాయి.

'నాసా' సంస్థ అంతరిక్ష కార్యక్రమం నుండి లభించే కొత్త ఫలితాలను ప్రజానీకమంతా వినియోగించు కొనేలా చేయడానికి పథకాలు వేసింది. విన్నో కార్యాలయాలను ఇందుకోసం ఏర్పాటు చేసింది.

(శ్రీ జాన్జి అలెగ్జాండరు వ్యాసం ఆధారంగా)



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikariunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

నురుగు అమితం
సువాసన అమోఘం
ధర మాత్రం సరసం

రు.1.06
మాత్రమే
(పన్నులు
అదనం)




టర్కిష్ బాత్

తక్కువ ఖరీదు చేసే,
-ఎక్కువ కాలం మన్నే సబ్బు

గోద్రెజ్
ఉత్పాదన

Interpub/GST/3/76 TEL

